# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.




విడి ప్రతి
0-75 పైసలు

సంవత్సర చందా
రూ. 8-40

# రెమి

## టాల్కం పౌడరు



# మంత్ర మురళి

ఏడుస్తాడు

ఏయ్! ఏమిటి విశేషం?

నేడు నా జన్మదినం. విందులేదు. మిఠాయిలు లేవు. ఏమీ లేదు. (ఏడుస్తాడు)

ఉత్సాహంగా వుండు! చింతించకు. నా వెంట రా! అంతే!

ఇది నా జన్మదినం

ఆహా హా!

ఆనందదాయకమైన జన్మదినం!

విందు చేసుకుందాం

ఒహో!

క్యాడ్‌బరిస్ చాక్‌లెట్ లా!

క్యాడ్‌బరిస్ కీ జై!

## మాధుర్య జీవితానికి క్యాడ్‌బరిస్!



Cadbury's




క్యాడ్ బరిస్ చాక్ లెట్-

మిఠాయిని మించినది...ఆహారము.

LPE Alpara C.S.TEL.

మా అమ్మ ఉషా కుట్టుమిషన్‌పై కుట్టింది. ఉషా కుట్టుమిషన్‌తో కుట్టుపని చాలా తేలికగా చేసుకోవచ్చునని మా అమ్మ చెబుతూ వుంటుంది. కాని, నన్నెప్పుడూ దాన్ని అంటుకోనివ్వదు. నే పెద్దదాన్ని అయిన తరువాత నా కొక ఉషా కుట్టుమిషన్ కొని ఇస్తానన్నది. అందువల్ల అదా చేసుకోవచ్చుని మా అమ్మ చెబుతుంది. అదా అంటే ఏమిటో నాకు తెలియదు. బహుశా డబ్బు నేంగళనుకుంటాను.

# ఇదిగో! చూడు నా కొత్త ఫ్రాక్!



సుళువుగా కుట్టండి




తో కుట్టండి

జే (JAY) వారి ఉత్పత్తి

జే ఇంజనీరింగ్ వర్క్స్ లి.,
కలకత్తా-31

IESM G 669


ప్రొఫెషనల్
చిత్రములను
తీసే ప్రజాదరణ
పొందిన కెమేరా!
GEVAERT




AGIL







Ovomalt
FOOD BEVERAGE







BALLS BENGAL EAR RINGS

# బంగారు కవరింగ్

# రాజా



RAJA. 1421. Rs. 4-00 PAIR







## ఆభరణములు ధరించండి.



RAJA. 1422. Rs. 4-00 PAIR




SPECIAL STONE RING Rs. 10-00



DESIGN EAR RINGS
BIG SIZE Rs. 3-00.
MEDIUM Rs. 2-50.
SMALL Rs. 2-00.
PER PAIR.




2-4" SIZE Rs. 10-00. 2-2 SIZE Rs. 9-00 PER PAIR.

## రాజాగోల్డుకవరింగ్ వర్క్స్ (REGD) POST BOX No. 38. H.O. మచిలీపట్నం.

బ్రాంచీలు: గవర్నరుపేట విజయవాడ 2-మెయిన్‌బజారు ఏలూరు-చిక్కడపల్లి హైదరాబాద్ 20

---

# అశోకా (మైక్రోనైజ్డు) శాండల్‌వుడ్ పౌడర్సు

దేశమంతట విరివిగా ఉపయోగించుచున్నారు




**అశోకా శాండల్‌వుడ్ ఆల్‌పర్పస్ పౌడరు:** దిన స్నానాంతరం శరీరమంతా చల్లుకొనుటకు—శరీరమును చల్లగావుంచి కళకళలాడేట్లు చేయును. చర్మ వ్యాధులను నిరోధించును. **అశోకా శాండల్‌వుడ్ టాల్కం పౌడరు:** దినము టాయిలెట్‌గా అలంకరణ సాధనముగా ఉపయోగించండి. **అశోకా శాండల్‌వుడ్ ఫేస్ పౌడర్:** అందమయిన ప్లాస్టిక్ డబ్బాలలో దొరకును. దానిని వ్యానిటీ బ్యాగ్‌లో ఉంచుకుని అప్పుడప్పుడు ముఖమునకు చేతులకు అద్దుకొనిన అది చెమటను గ్రహించి ముఖమును ఎంతో కాంతివంతముగా తామర పుష్పంవలె వుంచును. మరియు మనోహరదాయకమైనది ఎల్లప్పుడూ వాడండి.

తయారుచేయువారు:

## విజయ కెమికల్స్, మద్రాసు-7.

ప్రతి వూరిలో స్టాకిస్టులు కావలెను.



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఇటీవల "చందమామ"లో ప్రారంభించిన "కృష్ణావతారం" సీరియల్ కథ "హరివంశం" ఆధారంతో రాస్తున్నది. దీనికీ భాగవతంలో ఉన్న కృష్ణుడి కథకూ కొన్ని వివరాలలో తేడా ఉండవచ్చు. అయితే భాగవతంలోని కృష్ణుడి కథ ఆబాలగోపాలానికీ తెలిసినదే కనక, "కృష్ణావతారం" కథలో కొంత కొత్తదనం పాఠకులకు కనిపించటం సహజం. ఈ కథను అందరూ ఆసక్తితో చదువుతారని ఆశిస్తాము.

సంపుటి 39 డిసెంబర్ '66 సంచిక 6

CHITRA



# భారత చరిత్ర




బాలాజీబాజీరావు నాయకత్వం కింద కూడా మహారాష్ట్ర సామ్రాజ్య విస్తరణ కొంత జరిగింది. 1757 మార్చిలో శ్రీరంగపట్టణం వద్ద మహారాష్ట్ర సైన్యాలు ప్రత్యక్షమయాయి. కృష్ణానదికి దక్షిణంగా ఉండే ప్రధాన రాజ్యాల వారందరూ మహారాష్ట్రులకు కప్పాలు చెల్లించవలసి వచ్చింది. ఆర్కాటు నవాబు చౌథ్ బాపతు పాత బాకీ కింద రెండు లక్షలు నగదు ఇచ్చి, మరొక రెండున్నరలక్షలు దఫాలవారిగా చెల్లించుకుంటానన్నాడు.

మహారాష్ట్రులు బిదనూరు, మైసూరు సంస్థానాల పైన కూడా దాడులు చేశారు; క్లైవు, వాట్సన్‌ల నాయకత్వాన అంగ్రియా అనే నౌకాధిపతితో పోరాటం సాగించే ఇంగ్లీషు వారికి సహాయం చేశారు. మహారాష్ట్రుల పురోగమనానికి కొంత అడ్డు తగిలిన వారెవరంటే, మైసూరు సేనాపతి హైదరూ, బుస్సీ అనే ఫ్రెంచివాడూ, హైదరాబాదుకు నిజాముగా ఉండిన ఆలీ.

అయితే పేష్వా తమ్ముడి కొడుకైన సదాశివరావు అనేవాడు 1760 లో ఉద్గీర్ వద్ద నిజామును ఓడించాడు. బుస్సీ కింద నిజాముసేనలో ఫిరంగి నిపుణుడుగా పని చేసిన ఇబ్రాహిం ఖాన్‌గర్దీ అనేవాడు మహారాష్ట్రులతో చేరాడు; అతనికి పాశ్చాత్య యుద్ధ తంత్రం తెలుసును. ఈ యుద్ధంలో ఓడిన ఫలితంగా నిజాము మహారాష్ట్రులకు బిజాపూరు సంస్థానం మొత్తంగానూ, ఔరంగాబాదులో చాలా హెచ్చు భాగమూ, బీదరులో కొంత భాగమూ ఇచ్చుకుని, దౌలతాబాదు దుర్గంతో సహా అనేక దుర్గాలు వారి వశం చెయ్యవలసి వచ్చింది. ఈ విధంగా దక్షిణదేశంలో మొగలుసామ్రాజ్యంలోని కొంతభాగం మహారాష్ట్రులు చేజిక్కించుకున్నారు.

63. బాలాజీబాజీరావు

మహారాష్ట్రులు ఉత్తర దేశంలో ఇంతకు మించిన విజయాలు సాధించారు. 1756 అంతంలో మల్హార్‌రావు హోల్కర్, రఘునాథరావులు కొద్ది వారాల తేడాలో తిరిగి ఉత్తరానికి పంపబడ్డారు. రఘునాథరావు నాలుగు మాసాల పాటు రాజపుత్రస్థానంలో ఉండి పోవలిసి వచ్చింది. అందుచేత అతను సఖారాంబాపు అనే వాడి నాయకత్వాన 20,000 మంది సైనికులను "దో ఆబ్" ప్రాంతానికి పంపాడు. సఖారాం బాపు తెలివిగా జాత్‌లను మంచి చేసుకుని, 1757 లో ఢిల్లీపై దాడిచేసి, ఢిల్లీలో అబ్దాలీ చేత నియంతగా నియమించబడిన నాజిబుద్దౌలా అనే వాడిచేత తమ షరతులపై సంధి చేసుకోవటానికి ఒప్పించారు.

1758 మార్చిలో సిర్‌హిండ్, ఏప్రిలులో లాహోరు మహారాష్ట్రులకు చిక్కాయి. ఆదీనబేగ్ అనేవాణ్ణి పంజాబులో తమ రాజప్రతినిధిగా మహారాష్ట్రులు నియమించారు. అయితే ఈ ప్రాంతాన్ని దక్కించుకోవటానికి తగిన సన్నాహాలు జరగని కారణంచేత రఘునాధుడి "ఘన విజయం" రాజకీయంగానూ, ఆర్థికంగానూ కూడా బోలెడంత నష్టాన్ని కలిగించింది; అబ్దాలీతో మరొక యుద్ధం అనివార్యం చేసింది.



1758 అక్టోబరు 13 న ఆదీనబేగ్ మరణించటంతో పంజాబులో అరాజకం ప్రబలింది. దానిని సరిచేయటానికి పేష్వా 1759 లో దత్తాజీసింధియా అనే వాణ్ణి పెద్ద సేనతో పంజాబుకు పంపాడు. దత్తాజీ సింధియా పాలకుడుగా సాబాజీసింధియా అనే వాణ్ణి నియమించాడు. కాని త్వరలోనే బలమైన దుర్రానీ సేనలు వచ్చిపడి, పంజాబును జయించాయి. 1759 నవంబరులో పంజాబును పూర్తిగా జయించి, అహ్మద్‌షా అబ్దాలీ ఢిల్లీ పైకి వెళ్ళాడు.

ఈ సమయంలో మహారాష్ట్రులకు ఎవరూ సాయపడక పోవటమే వారి అప

జయానికి కారణం. రుహేలాలూ, ఔధ్ నవాబూ అబ్దాలీ పక్షమయారు. రాజపుత్రులు తటస్థంగా ఉండి పోయారు. సిక్కులు కూడా వారికి సహాయపడలేదు. ఇందుకు కారణం బాలాజీబాజీరావు అనుసరించిన విధానాలే. అతను తన తండ్రి విధానాలలో రెండు మార్పులు చేశాడు. ఒకటి, పాశ్చాత్య యుద్ధతంత్రం నిమిత్తం అతను తన సేన లోకి అన్నిరకాల వృత్తి సైనికులనూ రానిచ్చి, సైన్యంలో ఐక్యతా, క్రమశిక్షణా లేకుండా చేశాడు. అతను చేసిన రెండవ పొరపాటు "హిందూ-పాద్-పాద్‌షాహీ" నినాదానికి స్వస్తి చెప్పటం; ఆ నినాదం హిందూ రాజ్యాల నన్నిటినీ ఏకం చెయ్యటానికి ఉపకరించేది. అందుచేత అతని అనుచరు[illegible] ముస్లిము విచక్షణ లేకుండ[illegible]ంతాల పైనపడి బంది పోటు[illegible] పెంచారు. ఈ కారణంగా[illegible] సేనలను ఎదుర్కొవలసి వచ్చేసరికి మహారాష్ట్రులకు ఎవరూ సాయం రాకపోగా, లోగడ సహాయపడిన వారిలో అనేకమంది దుర్రానీల పక్షం కావటం జరిగింది.

1759 ఆఖరుదినాలలో దత్తాజీ సింధియా అబ్దాలీ చేతిలో స్థానేశ్వరం వద్ద ఓడిపోయి, ఢిల్లీ కేసి తిరోగమించాడు. దారిలో, ఢిల్లీకి ఉత్తరాన పదిమైళ్ళ దూరాన బరారీఘాట్ అనేచోట అఫ్ఘానులు అతన్ని 1760 జనవరి 9 న చంపేశారు. దుర్రానీ అశ్వికదళాల ధాటికి తట్టుకోవటం మల్హార్‌రావు హొల్కర్ మొదలైన వారికి సాధ్యం కాలేదు. అంతకు పూర్వమే నిజామును ఓడించి కీర్తిమంతుడైన సదాశివరావు భావును పేష్వా పెద్ద సేనతో పంపుతూ, పదిహేడేళ్ళ వయసుగల తన కొడుకును విశ్వాస్ అనే వాణ్ణి, సేనలన్నిటి పైనా నామమాత్రపు సేనాపతిగా చేసి ఉత్తర దేశానికి పంపాడు.



# నేహ్రూ కథ

## 30



అవి చాలా ఉద్రిక్తతతో కూడుకున్న రోజులు. ఎక్కడ చూసినా ప్రొసెషనులూ, లాఠీచార్జీలూ, కాల్పులూ, హర్తాళ్ళూనూ. ఏ పెద్దవాడు అరెస్టయినా హర్తాల్ జరిగేది. విదేశీవస్త్ర బహిష్కరణోద్యమం చాలా తీవ్రంగా సాగింది. పికెటింగులు సాగాయి. వయసుమీరిన తన తల్లీ, చెల్లెళ్ళూ మండు టెండలో, విదేశీ వస్త్రాలమ్మే దుకాణాల ముందు నిలబడి పికెటింగు చేస్తున్నారని విని జవాహరు చలించాడు. అందరినీ మించి పని చేసినది అతని భార్య కమల. ఆమె తన అనారోగ్యాన్ని కూడా లక్ష్యపెట్టకుండా ఎంతో శ్రమించి పని చేసింది.

అన్నిటినీ మించి జవాహరును పారవశ్యంలో ముంచెత్తిన సంఘటన ఏప్రిలు 23 న పెషావరులో జరిగింది; దరిమిలా అలాంటి సంఘటనలు సరిహద్దు రాష్ట్రమంతటా జరిగాయి. పఠానులు ఆదర్శప్రాయమైన అహింసావిధానాన్ని అవలంబించి, క్రమశిక్షణతోనూ, అసాధారణ ధైర్యంతోనూ మరతుపాకుల నెదుర్కొని నిలబడ్డారు.

సరిహద్దు రాష్ట్రంలో జరిగిన మరొక అసాధారణ సంఘటన ఏమిటంటే, గర్వాలీ సిపాయిలు పౌరుల పైన కాల్పులు చేయ నిరాకరించారు. నిరాయుధ ప్రజలపై కాల్పులు చేయటం సైనికుడికి దుర్భరమైన విషయం. అది అలా వుండగా, ఈ సందర్భంలో సైనికులకు ప్రజలతో సానుభూతి కూడా ఉండి ఉండవచ్చు. అయినప్పటికీ సైనికుడు అధికారి ఉత్తరువును ఉల్లంఘించటం ఘోరమైన దప్పిదం. దానికి శిక్ష కూడా తీవ్రంగా ఉంటుంది. అందుచేత గర్వాలీ సైనికులు, నిరాయుధులైన ప్రజలపై కాల్పులు జరప నిరాకరించటంలో



ఎంతో త్యాగం, చాలా ధైర్యసాహసాలు ప్రదర్శించారు.

ఆ రోజులలో జరిగిన మరొక విశేష మేమిటంటే జాతీయోద్యమంలో స్త్రీలు అధికంగా పాల్గొనటం. అనేక సందర్భా లలో స్త్రీల దళాల ప్రొసెషన్లు జరిగాయి. అనేక ప్రాంతాలలో స్త్రీలు కాంగ్రెసు డిక్టే టర్లుగా పని చేశారు.

ఉప్పు సత్యాగ్రహంగా ప్రారంభమైన శాసనోల్లంఘనం రోజులు గడిచిన కొద్దీ ఇతర శాఖలకు పాకింది.

ఏ యే శాసనాలను ఉల్లంఘించాలి అని కాంగ్రెసువారు అంతగా మధనపడ నవసరం లేకుండా, అనేకరకాల చర్యలను నిషేధించుతూ వైస్రాయి ఆర్డినెన్సులు జారీ చేశాడు. ఈ ఆర్డినెన్సుల సంఖ్య పెరిగిన కొద్దీ శాసనోల్లంఘనానికి పలు విధాల మార్గా లేర్పడి, ఉద్యమం చురుకుగా సాగింది. వైస్రాయి నిషేధించిన పనులన్నీ చెయ్యు టమే ఉద్యమం! ఉద్యమాన్ని నిలుపు చెయ్యటానికి గాను జారీ చేసిన ఆర్డినెన్సులు ఉద్యమానికి దోహదం చెయ్యటం చూసి, వైస్రాయి మతి చెడినట్టుగా కొత్త ఆర్డి నెన్సులు జారీ చేశాడు. ఒక్కొక్క ఆర్డి నెన్సే అమలులోకి వచ్చినప్పుడల్లా దాన్ని ఉల్లంఘించటానికి ప్రజలు ఏం చెయ్య వలసినదీ కాంగ్రెసు వర్కింగు కమిటీ సూచిస్తూ వచ్చింది.

ఈ సూచనలను పత్రికల వాళ్ళు తప్ప మిగతా వర్గాలన్నీ అమలు చేశాయి.

మే 5 న గాంధీజీ అరెస్టయాడు. పశ్చిమ తీరాన ఉప్పుమడుల మీదా, ఉప్పుకొటార్ల మీదా దాడులు సాగాయి. ఈ దాడులలో పోలీసుల ప్రవర్తన మహా దారుణంగా పరిణ మించిన సందర్భాలున్నాయి. బొంబాయి హర్తాళులతోనూ, ఊరేగింపులతోనూ, లాఠీ చార్జీలతోనూ అట్టుడికి పోయింది. లాఠీ చార్జీలలో దెబ్బలు తిన్నవారికోసం ఎమర్జన్సీ

అస్పత్రులు ఏర్పాటయాయి. బొంబాయిలో జరిగిన సంఘటనల వంటివి అనేక ఇతర చోట్ల కూడా జరిగినప్పటికీ, మహానగరం కావటంతో బొంబాయి సంఘటనల వార్తలకు ప్రాముఖ్యం వచ్చింది.

జూను ఉత్తరార్ధంలో మోతీలాల్ తన భార్యనూ, కోడలు కమలనూ వెంటబెట్టుకుని బొంబాయి వెళ్ళాడు. వారికక్కడ బ్రహ్మాండమైన స్వాగతం లభించింది. వారక్కడ ఉండగానే అనేక దారుణ సంఘటనలు జరిగాయి. బొంబాయిలో లాఠీచార్జీ నిత్యకృత్యమై పోయింది. మరొక రెండు వారాల అనంతరం మాలవీయా, మరికొందరు వర్కింగు కమిటీ సభ్యులూ పెద్ద గుంపును వెంట బెట్టుకుని బొంబాయిలో వెళుతుంటే పోలీసులు దారికి అడ్డంగా నిలబడ్డారు. తెల్లవార్లూ ఉభయపక్షాలూ జాగరంచేశాయి.

మోతీలాల్ బొంబాయి నుంచి తిరిగి వచ్చాక, జూన్ 30 న అరెస్టయాడు. ఆయన వెంట సయ్యద్-మహమ్మద్ కూడా అరెస్టయాడు. ఆ సమయంలో వారు కాంగ్రెసు అధ్యక్షుడూ, కార్యదర్శీనూ. కాంగ్రెసు వర్కింగుకమిటీ నిషేధించబడినాక వారి అరెస్టు జరిగింది. ఇద్దరికీ ఆరేసి నెలలు



ఖైదు విధించబడింది. పౌరుల పైన కాల్పులు జరపవలసిందిగా అధికారులు ఉత్తరువిచ్చే పక్షంలో సైనికుడుగాని, పోలీసుగాని ఎలా వ్యవహరించాలో సూచిస్తూ మోతీలాల్ ఒక ప్రకటన చేశాడు. ఆ ప్రకటనే ఆయన అరెస్టుకు కారణం అయివుండవచ్చు, కాని ఆ ప్రకటనలో చట్టవిరుద్ధమైన అంశమేమీ లేదు. అయినప్పటికీ అధికారులకది చాలా ప్రమాదకరమైన ప్రకటనగానే కనబడింది!

అరెస్టయే సమయానికి మోతీలాల్ ఆరోగ్యం అంత బాగాలేదు. ఆయనకు అధ్యక్షుడుగా పని జాస్తి అయింది. డాక్టర్ల

విశ్రాంతి తీసుకోమని సలహా ఇచ్చారు. ముసోరీ వెళ్ళటానికి అంతా సిద్ధంచేసుకుని సామానుకూడా సర్దుకున్నాడు. ముసోరీకి బయలుదేరవలసిన రోజుకు ముందు రోజే ఆయన నైనీ సెంట్రల్ జైలులో జవాహరు మొదలైనవారికి ప్రత్యక్షమయాడు.

జవాహర్ ఏడేళ్ళ అనంతరం మళ్ళీ జైలులో అడుగు పెట్టాడు. అతను దాదాపు జైలు జీవితం మరిచి పోయాడు కూడా. ఈసారి అతన్ని ఒంటరిగా ఖైదు చేశారు. ఇది అతనికి సరికొత్త అనుభవం. అతన్ని ఉంచిన ఆవరణ సుమారు నూరడుగుల వ్యాసంగల వలయం. దానిచుట్టూ 15 అడుగుల ఎత్తుగల ప్రహరీ ఉండేది. ఈ ఆవరణలో నాలుగుకొట్లు గల ఒక అసహ్యకరమైన ఇంట్లో అతన్ని ఉంచి, అందులో రెండు కొట్లుమాత్రం అతనికి కేటాయించారు. మిగిలిన రెండుకొట్లూ ఖాళీగానే ఉన్నాయి.

జనం మధ్య, అస్తమానమూ కార్య నిమగ్నుడై జీవించిన జవాహరును జైలులో ఒంటరి తనం చాలా బాధించింది. రెండు మూడు రోజులపాటు జాస్తిగా నిద్ర పోయాడు. ఎండలు జాస్తి అవుతున్నాయి. అతన్ని ఆరుబయట పడుకోనిచ్చారు. తాను మంచం చంకన పెట్టుకుని వెళ్ళి పోతాడనో, లేక నిచ్చెనగా ఉపయోగించి ప్రహరీ గోడ ఎక్కి పారిపోతాడనో తన మంచాన్ని దృఢంగా గొలుసులతో బంధించారంటాడు జవాహరు.

జవాహరు నుంచిన ప్రత్యేక ఆవరణ మరీ ప్రమాదకరమైన ఖైదీలను ఉంచటానికి కట్టినదట. జైలులో దానికి "కుత్తాఘర్" (కుక్క ఇల్లు) అని ప్రసిద్ధి కూడా ఉండే దట. తరవాత తరవాత దాన్ని రాజకీయ ఖైదీలకు కూడా వినియోగించి, మిగిలిన ఖైదీలతో వాళ్ళకు ఎలాటి సంబంధమూ లేకుండా చూస్తూ వచ్చారు.





# పాతాళదుర్గం

## 8

[ఉగ్రసేనుడి రాజభవనాన్ని కదంబజారులు ఆక్రమించుకుని, కోశాగారం కొల్లగొట్టారు. తరవాత వాళ్ళు రాజు కోసం అరణ్యంలోకి బయలుదేరారు. ధూమకసోమకులు వాళ్ళను శాంతపరిచి, తిప్పి పంపారు. ధూమకుడి నడుము నుంచి వేలాడుతున్న మంత్రదండం గాలిలోకి లేచింది. సోమకుడు దాన్ని పట్టుకోడానికి పై కెగిరాడు. తరవాత—]

సోమకుడు గుర్రం మీది నుంచి ఒక్క ఎగురు ఎగిరి గాలిలో తేలిపోతున్న మంత్ర దండాన్ని పట్టుకోగలిగాడు. కాని, ఈ లోపల గుర్రం పక్కకు పోవటంతో అతడు దభీ మంటూ కింద పడిపోయాడు. అయినా సోమకుడు మంత్రదండాన్ని మాత్రం తన గుప్పెట నుంచి వదలలేదు. ఈ లోపల ధూమకుడు గుర్రం నుంచి కిందికి దూకి, "బలే, సోమూ! మెలకువ అంటే అలా వుండాలి. ఒక్క ఊపున అది నడుముకు కట్టిన తాడు తెంచుకోవటంతో, ఏం జరుగుతున్నదీ నేను గ్రహించలేక పోయాను. మొత్తం మీద కాలశంబరుడి మంత్రదండం మహత్తు గలదే!" అన్నాడు.

సోమకుడు మంత్రదండం పట్టుకుని లేచి నిలబడ్డాడు. అది అతడి గుప్పెట పట్టు నుంచి బయట పడేందుకు పాము లాగా అటూ యిటూ మెలికలు తిరగసాగింది.





చూసిన దిక్కు తూర్పు. అవునా?" అన్నాడు ధూమకుడు. సోమకుడు అవునన్నట్టు తలవూపాడు.

"ఇందులో మహత్తు వున్న సంగతి రహస్యంగా వుంచుదాం. రాజకుమార్తె కాంతిసేనను వెతికి తెచ్చే బాధ్యత మన పైన పడింది కదా. ఈ మంత్రదండం అందుకు మనకు సహాయపడవచ్చు," అన్నాడు ధూమకుడు. ఆ తరవాత ఇద్దరూ గుర్రా లెక్కి మంత్రి గంగాధరు డున్న ప్రాంతానికి వెళ్ళారు.

"తిరుగుబాటుదార్లను, ఏ రక్తపాతం లేకుండా కదంబనగరానికి తిప్పి పంపినందుకు మీ ఇద్దర్నీ అభినందిస్తున్నాను. కాని, వాళ్ళకు మీరు చేసిన వాగ్దానం నాకు ఆశ్చర్యం కలిగిస్తున్నది. రాజకుమారి కాంతిసేనను, రాక్షసుడి బారి నుంచి మీ రెలా విడిపించి తీసుకురాగలరు?" అని అడిగాడు మంత్రి గంగాధరుడు.

"అందుకు ప్రయత్నిస్తాం, ప్రభూ! ఆ ప్రయత్నంలో చావటానికైనా మేం సిద్ధమే. మా వాళ్ళకు మాట ఇచ్చాం," అన్నాడు ధూమకుడు.

"ఇద్దర్లో నువ్వు నాయకుడిలా కనిపిస్తున్నావ్. నా కుమార్తెను తేగలిగావంటే,

అంతేకాక దానిలో నుంచి అస్పష్టమైన ధ్వను లేవో బయల్వెడలసాగినై. ధూమకుడు దాని కేసి పరీక్షగా కొంచెంసేపు చూసి, "సోమూ! నాకో ఆలోచన వచ్చింది. కాల శంబరుడు దీని కోసం ఏవో మంత్రాలు జపిస్తున్నాడు. అందుకే ఇది అతణ్ణి చేరేందుకు ప్రయత్నిస్తున్నది," అన్నాడు.

"మనం ఇది చూపే దారి వెంటబడిపోతే, ఆ దుర్మార్గుణ్ణి పట్టుకోవచ్చు గదా?" అన్నాడు సోమకుడు, మంత్రదండాన్ని ధూమకుడి కిస్తూ.

"అదెలా సాధ్యం? దీనితోపాటు గాల్లోకి మనం ఎగరలేం కదా! ఇప్పుడిది ఎగిరిపో



నీకు అర్ధరాజ్యం ఇస్తాను, ధూమకా!" అన్నాడు రాజు ఉగ్రసేనుడు.

"ఒకటి; మీ కిప్పుడు రాజ్యమే లేదు. రెండు; ఉన్నా—మీ నుంచి నేను అర్ధ రాజ్యం ఆశించటం లేదు," అన్నాడు ధూమకుడు కోపంగా.

కదంబమంత్రీ, కోశాధికారీ కొరకొర చూస్తూ, ధూమకుడి కేసి ఒకడుగు వేయ బోయేంతలో గంగాధరుడు వాళ్ళను ఆపి, "చింత చచ్చినా పులుపు చావలే దంటారే, అదే యిది," అని తన సైకుల కేసి తిరిగి, "ఉగ్రసేన మహారాజునూ, ఆయన పరివారాన్ని మన నగరానికి తీసుకుపోయి విడుదులు ఏర్పాటు చేయండి," అని ఆజ్ఞా పించాడు.

రాజు ఉగ్రసేనుడూ, అతడి మంత్రీ, కోశాధికారీ కుంతల సైనికుల వెంట బయలుదేరి కొండవాగు దాటగానే, మంత్రి గంగాధరుడు ధూమకుడితో, "మీ యిద్దరికీ నేను కుంతలరాజ్య సైనికుల దుస్తులు యిస్తున్నాను. అంతేకాక, మీరు కుంతల రాజుగారి పని మీద వెళుతూన్నట్టు పత్రం ఒకటి యిస్తాను. ఆ విధంగా మీకు అవసర సమయంలో ఏ మహారాజు నుంచయినా సహాయం పొందే వీలుంటుంది," అన్నాడు.



ధూమకుడందుకు కృతజ్ఞత తెలియ పరిచాడు. సేనానాయకుడు తెప్పించిన సైనికదుస్తులు, ధూమక సోమకులకు ఇవ్వ బడినై. వాళ్ళిద్దరూ ఆ దుస్తులు ధరించారు. తరవాత మంత్రి దగ్గిర సెలవు తీసుకుని వెళ్ళబోతూ, ధూమకుడు, "ప్రభూ! తమ కుమారుడు శశికాంతుడి మాటేమిటి? అతడు సజీవుడనే మనం భావించాలి గదా?" అన్నాడు.

"అందులో సందేహం లేదు. శశికాం తుణ్ణి, కాలశంబర మాంత్రికుడు వెంట తీసుకు పోయాడని నా నమ్మకం. మీరు రాక్షసుణ్ణి వెతికి పట్టుకుంటే, కాంతిసేన





ఎక్కడున్నదీ తెలుస్తుంది. ఇక నేను మాంత్రికుడు ఎక్కడున్నదీ కనుక్కోవాలి. ఆ పనికి శశికాంతుడి మిత్రుడైన భద్రుడనే వాణ్ణి కొంత సైనిక సహాయం యిచ్చి పంపుతాను," అన్నాడు మంత్రి గంగాధరుడు.

ధూమకుడు ఆ మాటల కేమీ జవాబు చెప్పకుండా, గంగాధరుడికి నమస్కరించి, సోమకుణ్ణి వెంటబెట్టుకుని తూర్పుదిక్కుగా బయలుదేరాడు. అతడి ఉద్దేశం మాంత్రికుడెక్కడున్నదీ తెలుసుకో గలిగితే, అతడి ద్వారా కుంభీరుడి నివాసస్థానం కనుక్కోవడం సులభం అని. వాళ్ళిద్దరి మధ్యా వున్న వైరం, వాళ్ళ సంభాషణ తీరూ ధూమకుడికి యిలాంటి అభిప్రాయం కలిగించింది.

ధూమక సోమకు లిద్దరూ కొండదారుల వెంట ప్రయాణించి, మిట్టమధ్యాహ్నం వేళకు ఒక మహారణ్యంలో ప్రవేశించారు. అక్కడ వారి కొక సెలయేరు కనిపించింది, ఆ సెలయేటి ఒడ్డున వెంట తెచ్చుకున్న ఆహారం తిని చెట్ల కింద కొంచెంసేపు విశ్రాంతి తీసుకుందా మనుకున్నారు వాళ్ళు.

ఇద్దరూ గుర్రాలు దిగి వాటిని చెట్లకు కట్టివేసి, ఏటిని సమీపించేంతలో, ఇసుకలో వారికి కొన్ని పాదాల గుర్తులు కనిపించినై. వాటిల్లో ముఖ్యంగా ఒకటి ధూమకుడి దృష్టిని ఆకర్షించింది. అది మామూలు పాదాల గుర్తు కాదు, పావుకోళ్ళు ధరించిన కాళ్ళ గుర్తులు. ధూమకుడు ఆశ్చర్యసంభ్రమాలతో వాటిని పరీక్షించసాగాడు. సాధారణంగా సాధువులూ, యోగులూ మాత్రమే పావుకోళ్ళు ధరిస్తారు. ఈ మహారణ్యంలో అలాంటివారి కేమి పనుంటుంది? పోతే, యివి మాంత్రికుడు కాలశంబరుడి పావుకోళ్ళ గుర్తులై వుండాలి. ఆ పక్కల నున్నవి శశికాంతుడి పాదాలగుర్తులై వుండొచ్చు.

"సోమూ, ఇవి కాలశంబరుడి పావుకోళ్ళ గుర్తులు, సందేహం లేదు," అన్నాడు





ధూమకుడు, పరధ్యానంగా ఏదో ఆలోచిస్తున్న సోమకుడితో.

సోమకుడు కనుబొమలు చిట్లించి, అడ్డంగా తలాడిస్తూ, "మనం తప్పుదారి పట్టాం ధూమూ! రాజకుమార్తెను ఎత్తుకుపోయింది రాక్షసుడు గదా? మనం వెతికి తెస్తామన్నది ఆమెని. మరి, ఈ మాంత్రికుడి కోసం గాలించటం ఎందుకు? మన కేమన్నా మతులు పోయినయ్యా!" అన్నాడు.

ధూమకుడతనికి తన అభిప్రాయం వివరించాడు: రాక్షసుడెటుపోయిందీ తెలుసుకునేందుకు అధారమేమీ లేదు. కాని, మంత్రదండం ఉన్నది గనకా, అది తూర్పుదిక్కుకు ఎగిరిపోయేందుకు ప్రయత్నం చేసింది గనకా, కాలశంబరుణ్ణి వెతికి పట్టుకోవడం కొంత తేలిక. అతడి ద్వారా కుంభీరుడు వుండే ప్రదేశం తెలుసుకోవచ్చు.

"అవును ఇదీ నిజమే!" అంటూ సోమకుడు తలవూపాడు. అయినా అతడికిదేదో డొంకతిరుగుడు దారి అన్న అనుమానం పోలేదు. ధూమకుడు సెలయేటి ఒడ్డుకు పోయి దాహం తీర్చుకుని, నీళ్ళల్లో దిగి అవతలి ఒడ్డుకు పోయాడు, నీరు మోకాళ్ళ లోతు మాత్రమే వున్నది. ఏటి కవతల




ఇసుకలో కూడా ధూమకుడికి పావుకోళ్ళ గుర్తులు కనిపించినై. అతడు సోమకుడికి ఏరు దాటి రమ్మని సంజ్ఞ చేశాడు. సోమకుడు దగ్గిరకు రాగానే, అతడికి ఆ గుర్తులు చూపిస్తూ, "మాంత్రికుడు యీ సెలయేరు దాటిపోయి ఎంతో కాలం అయి వుండదు. మనం ఇక్కడ భోజనం కోసం ఆగకుండా ముందుకు పోతే అతణ్ణి కలుసుకునే అవకాశం వుండొచ్చు," అన్నాడు.

"సరే అలాగే చేద్దాం. గుర్రాలను తీసుకొస్తాను," అంటూ సోమకుడు వెనక్కు తిరగబోయేంతలో, దాపుల నున్న చెట్ల చాటు నుంచి ఎవరో పెద్దగా చప్పట్లు చరిచిన




29





యేటి దగ్గిరకు పోవటం మంచిది. అక్కడ మన మీద ఎవరూ దొంగచాటుగా వచ్చి దెబ్బతీయలేరు," అన్నాడు ధూమకుడు. ఆ వెంటనే ఇద్దరూ పక్కకు తిరిగి ఏటి కేసి పరిగెత్త బోయేంతలో, ఈలలూ, చప్పట్లతోబాటు అరణ్యం ప్రతిధ్వనించేలా కేకలు వినిపించినై. ఆ వెంటనే నలుగు రైదుగురు ఆటవికులు చెట్లకొమ్మల్లోంచి వాళ్ళ మీదికి దూకారు. మరి కొందరు ఆట వికులు చెట్లచాటు నుంచి పెడబొబ్బలు పెడుతూ వాళ్ళను చుట్టుముట్టారు.

ధూమక సోమకులు ఒకళ్ళ నొకళ్ళు హెచ్చరించుకునే అవకాశం కూడా లేదు. ఇద్దరూ ఒకేసారి, "జై, కాళేరమ్మా!" అంటూ ఆటవికుల మీద విరుచుకు పడ్డారు. వాళ్ళ చేతుల్లోని వాడికత్తులు మెరుపు వేగంతో ఎదురైన ఆటవికుల్ని తునాతుని యలు చేయసాగినై. మీద పడి పట్టుకోవా లని చూసిన ఆటవికులు, ధూమక సోమ కులు శరీరాలు విదిలించే సరికి గాలిలోకి లేచి అల్లంత దూరాన చెట్లల్లో దభీమంటూ పడసాగారు.

ఒకటి రెండు నిమిషాలు గడిచినై. ఎంత బలం, ధైర్యం, కత్తియుద్ధంలో నేర్పూ వున్నా, తోడేళ్ళ గుంపులా వచ్చి మీద పడే

శబ్దమైంది. ధూమక సోమకులు కత్తులు దూసి, ఆ శబ్దం వచ్చిన చెట్ల కేసి పరిగెత్తి వాటి వెనక వెతికారు, కాని అక్కడ ఎవరూ లేరు. వాళ్ళు ఆశ్చర్యపడుతూ వెనక్కు తిరిగేంతలో, మరొక వైపు నుంచి చప్పట్లూ, ఈలలూ వినిపించినై. ధూమక సోమకులు ఈసారి జాగ్రత్తగా అడుగులో అడుగు వేసు కుంటూ ఆ వైపుకు బయలుదేరారు. వాళ్ళా విధంగా కొద్ది దూరం వెళ్ళేసరికి, ఈసారి చప్పట్లు, వాళ్ళకు కుడివైపు నున్న చెట్ల చాటు నుంచి వినబడినై.

"సోమూ, మన నెవరో చుట్టుముట్టి హతమార్చాలని చూస్తున్నారు. మనం సెల



ఆటవికుల ధాటికి ధూమక సోమకులు తట్టుకుని నిలబడటం కష్టమైంది. ఆటవికులు విసిరిన బల్లాల్లో ఒకటి రెండు వాళ్ళకు తగిలి, గాయాల నుంచి రక్తం కారసాగింది. చివరకు కత్తి తిప్పేందుకూడా వీలు లేకుండా ఆటవికులు గుంపుగా కట్టకట్టుకు వచ్చి మీద పడి, వాళ్ళిద్దర్నీ పట్టుకున్నారు.

ఆటవికుల ఆనందానికి మేర లేదు. వాళ్ళల్లో చచ్చినవాళ్ళు కొందరు చచ్చారు, కొందరు గాయపడి కేకలు పెడుతున్నారు, మరి కొందరు నడుములు విరిగీ, కీళ్ళు తొలిగీ మూలుగుతున్నారు. అయినా, మిగతా ఆటవికులు ధూమక సోమకుల్నీ పట్టుకున్నామనే ఆనందంలో కేరింతలు కొడుతూ, వాళ్ళ చుట్టూ చేరి గంతులు వేయసాగారు. దూరంగా తప్పెట మోగిన ధ్వని అయింది. గంతులువేసే వాళ్ళల్లో కొందరు ఆ ధ్వని వచ్చిన దిక్కు కేసి తిరిగి, "విరూపా! విరూపా!" అని కేకలు పెట్టారు. కొద్ది సేపట్లో అక్కడికి ఒక అజానుబాహువయిన ఆటవికుడు చేతిలో బల్లెం పట్టుకు వచ్చి, "అహ్హా, శాంభవీ!" అంటూ భీకరంగా అరిచి, కళ్ళెర్రచేసి, పళ్ళు పటపటా కొరుకుతూ, బల్లెం ఎత్తి ధూమక సోమకుల్ని పొడిచేందుకు ముందుకురికాడు.

ధూమక సోమకులు తమ అంతం సమీపించిందని గ్రహించి, మనసులో పెళ్ళాం బిడ్డల్ని ఒక్కసారి తలుచుకుని, గుండె రాయిచేసుకుని కళ్ళు మూసుకున్నారు. గుండెల్లో ఆటవిక నాయకుడి బల్లెంపోటు పడుతుందని ఎదురు చూసిన వాళ్ళిద్దరికీ గొప్ప ఆశ్చర్యం కలిగింది. ఆటవికనాయకుడు విరూపుడు, బల్లెం ఎత్తిన వాడల్లా దాన్ని జారవిడిచి, "అయ్యా, దొర బాబులూ! నా వాళ్ళ తప్పులు మన్నించండి," అంటూ వాళ్ళ పాదాల ముందు సాష్టాంగ పడిపోయాడు. —(ఇంకావుంది)





# ధనిక దాంపత్యం

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నీవు ఏ ప్రయోజనం కొరకు ఇంతగా శ్రమించుతున్నదీ నాకు తెలియదు. కాని దైవం అనుకూలించినట్లయితే అసాధ్యమైన కోరికలు కూడా అప్రయత్నంగా సిద్ధిస్తాయి. ఇందుకు నిదర్శనంగా నీకు కందర్పుడనే బ్రాహ్మణ యువకుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

వేణానదీ తీరాన రత్నపురమనే ఊరుండేది. ఆ ఊళ్ళో ధనికుడైన ఒక బ్రాహ్మణుడికి కందర్పుడనే కొడుకుండేవాడు. ఒక రోజు సాయంకాలం కందర్పుడు స్నానం చెయ్యటానికని నదికి వెళ్ళి, కాలు జారి నదిలోపలికి కొట్టుకుపోయాడు.

*బేతాళ కథలు*



ప్రవాహవేగాన కందర్పుడు తెల్లవార్లూ కొట్టుకుపోయి, తెల్లవారుజామున, నదిలోకి ఒరిగిపడిన ఒక పెద్ద చెట్టుకొమ్మల మధ్య చిక్కుకున్నాడు. ఆ చెట్టు మీదిగా పాకి అతను ఒడ్డు చేరేసరికి, సమీపంలోనే మాతృదేవతల ఆలయం ఒకటి కనిపించింది. అతను ఆ ఆలయంలో ప్రవేశించి, మాతృదేవతామూర్తులకు దణ్ణం పెట్టి, "తల్లులారా, యీ దీనుణ్ణి కాపాడండి," అని ప్రార్థించి, అలసిపోయి ఉండడం చేత అక్కడే పడుకుని నిద్రపోయాడు.

పగలల్లా గడిచి రాత్రి వచ్చింది. కందర్పుడికి నిద్ర మెలకువ వచ్చేసరికి మాతృదేవతలు తమలోతాము మాట్లాడుకోవటం వినిపించింది.

"ఇవాళ చక్రపురిలో చక్రమేళకం జరుగుతుంది. మనం అక్కడికి పోవాలి. కాని ఈ అబ్బాయి మనని శరణుజొచ్చాడు గదా, ఇతణ్ణి ఈ అరణ్యంలోని క్రూర మృగాల మధ్య ఒంటరిగా ఎలా విడిచి వెళ్ళడం? ఇతన్ని ఎవరి ఇంటనన్నా భద్రంగా ఉంచి, మనం తిరిగి వచ్చేటప్పుడు వెంట తీసుకువద్దాం," అని మాతృకలు నిశ్చయించుకున్నారు.

వారు అతన్ని చక్కగా అలంకరించి, ఆకాశమార్గాన తీసుకుపోయి, రత్నాకరపుర మనే ఊళ్ళో జయదత్తుడనే బ్రాహ్మణుడి ఇంట దించి, తమదారిన వెళ్ళారు.

దైవికంగా ఆ రోజే జయదత్తుడి కుమార్తె అయిన సుమన అనే పిల్లకు వివాహం జరుగుతున్నది. పెళ్ళి ప్రయత్నాలన్నీ పూర్తి అయాయి. సుమనను పెళ్ళికూతురిని చేశారు. పురోహితుడు మొదలైన వారంతా పెళ్ళివారి రాకకు ఎదురు చూస్తున్నారు. ముహూర్తంవేళ దగ్గిర పడుతున్నది, కాని పెళ్ళివారి జాడ ఇంకా లేదు.

అంతలో ఎవరో కందర్పుణ్ణి చూసి, "ఇడుగో పెళ్ళి కొడుకు!" అన్నారు.

అందరూ కలిసి అతన్ని వివాహవేదిక వద్దకు తీసుకుపోయారు. జయదత్తుడు విధ్యుక్తంగా అతనికి సాలంకృత కన్యాదానం చేసే శాడు. కందర్పుడి అందచందాలు చూసి పెళ్ళికి వచ్చిన ముత్తయిదువులందరూ, "సుమన ఎంత అదృష్టవంతురాలు! నవ మన్మధుడి లాటి భర్తను సంపాదించింది," అని అభినందించారు.

పెళ్ళి తంతు ముగిసేసరికి ఇంకా రాత్రి మిగులున్నది. కందర్పుడు మేడ మీదికి వెళ్ళి పడుకున్నాడు. తెల్లవారబోతూ ఉండగా, చక్రమేళకం నుండి తిరిగివస్తూ మాతృకలు అతన్ని తీసుకుని బయలుదేరారు.

కాని దురదృష్టవశాత్తూ, మాతృకలు ఆకాశగమనాన ఎగిరి పోతుండగా వారికి మరొక జట్టు ఎదురై, కందర్పుణ్ణి మాతృకల నుంచి అపహరించాలని ప్రయత్నించింది. రెండు జట్లకూ మధ్య జరిగిన పోరాటంలో కందర్పుడు కాస్తా మాతృకల చేతి నుంచి జారి కింద పడ్డాడు.

తన కీకష్టాల పరంపర తప్పదనుకుంటూ అతను దొరికిన దారి పట్టి నడవసాగాడు. తనకు వివాహమైన ఊరేదో కూడా అతనికి తెలీదు, తనను పెళ్ళాడిన కన్య పేరు సుమన అని మాత్రమే అతనికి



తెలుసు. దారిలో అతనికి మరొక బ్రాహ్మణ యువకుడు స్నేహితుడయాడు. కందర్పుడు అతని వెంట నడక సాగించాడు. వారలా కొద్ది రోజులు ప్రయాణించి రత్నానది సముద్రంలో కలిసే చోట ఉండే భీమపురాన్ని చేరుకున్నారు.

వారక్కడికి చేరేసరికి నదీతీరాన జనం గుంపులు గుంపులుగా చేరి ఉన్నారు.

సముద్రపు పోటుకు ఒక పెద్ద చేప ఒడ్డుకు కొట్టుకు వచ్చింది. మాంసం కోసం కొందరు ఆ చేపను కోస్తున్నారు. అలా కోస్తుండగా చేప కడుపులోనుంచి ప్రాణంతో సహా ఒక స్త్రీ బయటికి వచ్చింది.





అలా చేప కడుపులో నుంచి వచ్చినది తన భార్య సుమన అని గుర్తించి కందర్పుడు తన మిత్రుడితో, "ఆ పిల్లే నా భార్య సుమన. నువ్వేమీ మాట్లాడకు. ఏం జరుగుతుందో చూద్దాం," అన్నాడు.

ఈ లోపల పదిమందీ సుమన చుట్టూ మూగి, "నువ్వెవతెవు? ఈ చేపకడుపులో ఎలా ప్రవేశించావు?" అని ఆమెను ప్రశ్నించ నారంభించారు.

"మాది రత్నాకరపురం. మా తండ్రి పేరు జయదత్తుడు. నా పేరు సుమన. ఈ మధ్య ఒక రాత్రి నా కొక అందమైన యువకుడితో వివాహమయింది. తెల్లవారే సరికి నా భర్త కనిపించలేదు. నా తండ్రి ఎంత వెతికించి కూడా ప్రయోజనం లేక పోయింది. నాకు జీవితం పైన విరక్తికలిగి ఆత్మహత్య చేసుకుందామని నదిలో దూకాను. అందులో పడి కొట్టుకు పోతూండగా నన్నొక చేప మింగింది. అందులో నుంచి నన్ను మీరు బయటికి తీశారు," అన్నది సుమన.

ఆమె ఇలా చెబుతూండగా యజ్ఞస్వామి అనే బ్రాహ్మణుడు జనాన్ని తోసుకుని ముందుకు వచ్చి, "అయ్యో, సుమనా, ఎంత పని జరిగిందే!" అంటూ ఆమెను కౌగలించుకున్నాడు.

సుమన తల ఎత్తి చూసి తన మేనమామను గుర్తించి, "మామయ్యా!" అంటూ పెద్దగా ఏడ్చింది.

"దిగులు పడకమ్మా. మన ఇంటికి పోదాం పద," అన్నాడు యజ్ఞస్వామి.

"ఎందుకు, మామయ్యా? నాకు బతకాలని లేదు. ఉన్నట్టయితే కన్న ఇంటనే ఉండే దాన్నిగద. నా భర్తను విడిచి నేను బతకను. నా కిక్కడే చితి పేర్పించు. అందులో కాలి ప్రాణాలు విడుస్తాను," అన్నది సుమన.

ఆత్మహత్య చేసుకోవద్దని ఆమెను యజ్ఞస్వామే గాక అక్కడ ఉన్నవారంతా



బతిమాలారు. కాని సుమన నిశ్చయం మారలేదు. అంతదాకా చూస్తూ ఉండిన కందర్పుడు అప్పు డామె ఎదటికి వచ్చాడు. సుమన అతన్ని చూడగానే గుర్తించి, అతని కాళ్ళ పైన పడి ఆనందబాష్పాలు రాల్చింది.

"ఎవరమ్మా, ఇతనూ?" అని యజ్ఞస్వామీ, మిగిలినవాళ్ళూ కూడా సుమనను అడిగారు.

"ఈయనే నా భర్త!" అన్నది సుమన వికసించిన ముఖంతో.

యజ్ఞస్వామి పరమానందం చెందాడు. ఆయన సుమననూ, కందర్పుణ్ణీ, అతని మిత్రుణ్ణీ తన ఇంటికి తీసుకుపోయి, కొంత కాలం ఉంచుకుని, తరవాత పంపేశాడు. కందర్పుడు ముందుగా తన భార్యతో సహా అత్తవారింటికి వెళ్ళి, తరవాత తన ఊరికి వెళ్ళిపోయాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, నా కొక్క సందేహం. కందర్పుడు సుమనను చూడగానే ఆమె ఎదట పడక, ఆమె చితిలో కాలిపోవటానికి సిద్ధమయినదాకా ఎందుకు చూస్తూ ఉండిపోయాడు? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "సుమన దైవికంగా లభించిన భార్య అయినా కూడా, ఆమె తనను నిజంగా ప్రేమించిందన్న సంగతి తెలుసుకోవటంలో కందర్పుడికి ఎక్కువ ఆనందం ఉంటుంది. ఆత్మాభిమానం గలవాడు అర్హత లేకుండా వరాలు పొందగోరడు. అందుచేతనే మానవంతులు దైవానుకూల్యం కన్న తమ యత్నానికే హెచ్చు విలువ ఇస్తారు. కందర్పుడు ఆత్మాభిమానం గలవాడి లాగే ప్రవర్తించాడు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# దురభిమానం

ఒక గ్రామంలో రామయ్య అనే భూస్వామి ఉండేవాడు. అతని భార్యకు క్రమంగా ఆరోగ్యం చెడి చివరకు మంచం పట్టింది. జబ్బేమిటో వైద్యులకు అంతు చిక్కలేదు. వ్యాధిలక్షణాలను బట్టి మందులూ, మాకులూ ఇస్తే అవేవీ పని చెయ్యలేదు.

రామయ్య ఉండే గ్రామానికి దగ్గరలోనే మరొక గ్రామంలో ప్రశ్నలు చెప్పే దైవజ్ఞు డొకడుండేవాడు. కోరికలు తీరని వారెవరైనా ఆయన వద్దకు వెళ్ళి దక్షిణా తాంబూలమూ ఇచ్చి కూర్చుంటే, ఆ దైవజ్ఞుడు వాళ్ళు వచ్చిన పని తెలుసుకుని, ఆ పని సాను కూల మయేమార్గం చెప్పేవాడు. ఆయనతో ఒకటే చిక్కు: ఆయన చెప్పేది జాగ్రత్తగా విని, సరిగా అర్థం చేసుకోవాలి. సరిగా వినకపోయినా, విన్నది అర్థంకాక ప్రశ్నలు వేసినా ఆయన రౌద్రంగా మండిపడి, అవతలివాడు ఎంతటి వాడైనా సరే ముందు తూలనాడేవాడు, ఆ తరవాత తాను చెప్పిన దాన్ని వివరంగా తెలియజేసేవాడు.

ఈ కారణంచేత కాస్త అభిమానం గల వాళ్ళు ఆయన దగ్గిరికి వెళ్ళటానికి ఇష్టపడే వారుకారు. పని జరగటం ప్రధానంగా పెట్టుకున్నవాళ్ళు, ఆయనచేత నాలుగు పడటానికి సిద్ధమై వెళ్ళేవారు.

రామయ్యకు ఈ దైవజ్ఞుణ్ణి చూసి, తన భార్య ఆరోగ్యం బాగు చేయించుకోవాలన్న ఆలోచన చాలాసార్లు కలిగింది. కాని అభిమాని కావటంచేత ఆయన చేత అవమానం పొందవలిసి వస్తుందని సంకోచిస్తూ రోజులు గడవనిచ్చాడు. అయితే, తన భార్య జబ్బు నిమ్మళించాలంటే దైవజ్ఞుడి దగ్గిరికి పోక తప్పదని రామయ్యకు తోచిపోయింది. అందుచేత అతను ఒక మంచి రోజు చూసి, దక్షిణ తాంబూలం చేత బట్టుకుని దైవజ్ఞుణ్ణి చూడబోయాడు.

వి. రమణారావు

దైవజ్ఞుడు తెల్లటి గడ్డంతోనూ, మీసాల తోనూ, మంచి తేజస్సుతోనూ రామయ్యకు కనిపించాడు. రామయ్య ఎదురుగా కూర్చో గానే ఆయన, "నీ పేరు రామయ్య. నీ భార్య మంచం పట్టింది. అది ఎలా తేరు కుంటుందో తెలుసుకోవాలని వచ్చావు. అహంకారివిరా నువు, మహా దురహంకారివి! ఏమైతే నేం? వచ్చావు, పాపం. నువు ప్రకృతి విరుద్ధమైన కార్యం చేశావు. సహజసిద్ధమైన ప్రవాహానికి అనకట్ట వేశావు. ఆ అనకట్ట తీసెయ్యి, నీ భార్య వ్యాధి నయమవు తుంది. వృధాగా మందులకూ, మాకులకూ ధన వ్యయం చేయకు. నేను చెప్పింది తెలిసింది కదా?" అన్నాడు.

రామయ్య లోలోపల ఆశ్చర్యపడుతూ, తెలిసిందన్నట్టు తల ఆడించాడు. నిజానికి దైవజ్ఞుడు చెప్పినది రామయ్య కేమీ అంతు పట్టలేదు. తెలియలేదంటే దైవజ్ఞుడు ఇంకెంత అవమానంగా మాట్లాడతాడో అని రామయ్యకు భయంవేసింది. అందుచేత అతను లేచి ఇంటికి వచ్చేశాడు.

దైవజ్ఞుడు చెప్పిన మాటలు మననం చేసుకుంటూ ఉంటే రామయ్య కొక సంగతి జ్ఞాపకం వచ్చింది. రామయ్య తాను బల వంతుడు గనక తన చేను పక్కగా ఉన్న



పంటకాలవకు అడ్డుకట్ట కట్టి కిందటేడు తన పొరుగున ఉన్న కామయ్య చేనుకు నీరు లేకుండా చేశాడు. అందు వల్లనే తన భార్యకు జబ్బు చేసిందని దైవజ్ఞుడు చెప్పి నట్టు రామయ్యకు అర్థమయింది.

అందుకని రామయ్య కామయ్యను పిలిచి, "చూడు కామయ్యా. ఒక కారణం చేత కిందటేడు నీకు పంటకాలవ నీరందక, నువు చెరువు నీటితో ఇబ్బంది పడ్డావు. ఇక ముందు నీ చేనుకు కాలవనీరు అందేటట్టు చేస్తాను," అని మంచిగా చెప్పి పంపేసి, పంటకాలవకు తాను పెట్టిన అడ్డు తన మనుషుల చేత తీయించేశాడు.

ఇక తన భార్య కోలుకుంటుందను కున్నాడు రామయ్య. కాని అలా జరగలేదు. పైపెచ్చు ఆమె ఇంకా క్షీణదశకు వస్తున్నట్టు కూడా కనబడింది.

దైవజ్ఞుడు చెప్పిన మాటలను రామయ్య మళ్ళీ మననం చేసుకున్నాడు. సహజ ప్రవాహానికి తానింకే ఆనకట్ట కట్టాడో అతనికి ఎంత తన్నుకున్నా అర్థం కాలేదు. అందులో ఏదో గూఢార్థం ఉండి ఉండాలి. అది దైవజ్ఞుడే చెప్పాలి. చేసేది కనిపించక రామయ్య మరొకసారి దైవజ్ఞుడి దగ్గిరికి వెళ్ళాడు.

దైవజ్ఞుడు అతన్ని చూస్తూనే, "మళ్ళీ వచ్చావా? నువు మహాదురహంకారివని నేను మొదటే చెప్పానే. నేను చెప్పిన సలహా నీకు అర్థం కాలేదు. అర్థమయేటట్టు చెప్పమని అడగటానికి అభిమానం అడ్డొచ్చి, అర్థమయిందని తల ఆడించావు. చెబుతాను విను. ఈ దురహంకారంతోనే నువు నీ భార్యను ఆమె పుట్టింటి వారికి దూరం చేశావు. ఆమెకు తమ కన్నవారిపై ఉండే ప్రేమ సహజప్రవాహం లాంటిది. ఏదో అల్పకారణం ఆధారంగా నువా ప్రవాహానికి ఆనకట్ట కట్టావు. అది మొదలు నీ భార్య ఆరోగ్యం చెడింది. ఆ మనోవ్యాధి క్రమంగా పెరిగి ఆమె కాస్తా మంచం పట్టింది. వెళ్ళు! పోయి మీ అత్తవారికి క్షమాపణ చెప్పుకుని, వారిని తీసుకురా. వాళ్ళను చూసి నీ భార్య కోలుకుంటుంది," అన్నాడు.

రామయ్య అహంకారం ఆ దెబ్బతో దిగిపోయింది. అతను ఆ రోజే బయలుదేరి తమ అత్తవారూరు వెళ్ళి, అత్తమామలతో ఎంతో మంచిగా మాట్లాడి, వారిని తీసుకువచ్చాడు. తన తల్లిదండ్రులను చూసిన క్షణం నుంచీ రామయ్యభార్యలో మార్పు వచ్చేసింది. కొద్ది రోజులలోనే ఆమె లేచి తిరుగుతూ, చూస్తూండగానే పూర్ణారోగ్యం పొందింది.





# యక్షుడి నవ్వులు

యక్షస్థల మనే ప్రదేశంలో సోమగిరి అనే రైతు ఉండేవాడు. అతనికి భూవసతీ, పశువులూ ఉండేవి. కాని అతనిలో కొంత లోభ గుణం ఉండటం చేత పొలాల పనీ, పశువుల పోషణా తానే చూసుకుంటూ, ఉదయం లేచినది మొదలు రాత్రి పొద్దు పోయినదాకా తెగతిరుగుతూ ఉండేవాడు.

ఒకనాటి ఉదయం సోమగిరి తన పశువుల పని చూసుకుని పొలానికి పోతుండగా దారికి కొంచెం దూరంనుంచి ఎవరో గురక పెట్టుతున్న చప్పుడు వినిపించింది. సోమగిరి అటుగా వెళ్ళి చూసేసరికి కొన్ని చెట్ల మధ్య చాలా ఎత్తయిన పుట్టగొడుగూ, దాన్ని ఆనుకుని పడుకుని నిద్రపోతున్న మరుగుజ్జు మనిషీ కనిపించారు.

మరుగుజ్జు ఆకారమూ, పొట్టా, కురచ కాళ్ళూ, కురచ చేతులూ చూసి, అతనొక యక్షుడని సోమగిరి గ్రహించాడు. ఆ ప్రాంతంలో యక్షులను అప్పుడప్పుడూ చూసిన వాళ్ళున్నారు. పూర్వకాలంలో యక్షులు మనుషులతో స్నేహం చేసి, తమకు గల విద్యల సహాయంతో ఎన్నో మేళ్ళు చేసేవారట. ఆ కాలం పోయింది. ఇప్పుడు యక్షులు మానవులు కనపడితే పారిపోతారు. ఈ నిద్రపోతున్న యక్షుణ్ణి పట్టుకుని నిర్బంధించినట్టయితే వాడి సహాయంతో పెద్ద నిధి సంపాదించుకోవచ్చునని సోమగిరికి తట్టింది. అందుచేత అతను చప్పున వెళ్ళి ఆ యక్షుణ్ణి పట్టేసుకున్నాడు.

"నన్నెందుకు పట్టుకున్నావు? వదిలిపెట్టు!" అని యక్షుడు ఒళ్ళు తెలిసి, పెనగులాడాడు.

"దొరక్క దొరక్క దొరికావు. నాకొక మంచి నిధినిక్షేపం కావాలి. అది ఎక్కడ దొరుకుతుందో చెప్పినదాకా నిన్ను వదిలిపెట్టను," అన్నాడు సోమగిరి.

సి. సీతారామయ్య



"ధనం ఎక్కడ పాతిపెట్టి ఉంటుందో నాకు తెలీదు. నీ కెలా చెప్పేది?" అన్నాడు యక్షుడు అమాయికంగా.

"మంచిగా నువు చెప్పకపోతే నీకు చెయ్యవలసినదేదో నేను చేస్తాను," అని సోమగిరి యక్షుణ్ణి ఇంటికి తీసుకుపోయి, భోషాణంలో పడేసి, తాళం వేశాడు.

ఒక నెల గడిచింది. ఒకనాడు సోమగిరి అడవి ప్రాంతానికి వెళ్ళి వస్తుండగా ఒక కలపదుంగ దొరికింది. అది అన్ని పక్కలా చెక్కి ఉన్నది. అది ఆ అడవిలోకి ఎలా వచ్చిందో సోమగిరికి తెలియలేదు. అయినా అతను దాన్ని భుజాని కెత్తుకుని ఊళ్ళోకి మోసుకొచ్చి, దారిలో వడ్రంగి శరభయ్యకు అమ్మి, రెండురూపాయలు తీసుకుని, తిన్నగా ఇంటికి వచ్చాడు.

సోమగిరి ఇంట్లోకి అడుగు పెట్టగానే, భోషాణంలో ఉన్న యక్షుడు వికవికా నవ్వటం వినిపించింది. సోమగిరి యక్షుడితో, "నెలరోజులు నిర్బంధంలో ఉంచినా నీకు బుద్ధి రాలేదు. నా కొక నిక్షేపం చూపించి నీ దారిన వెళ్ళక నీలో నువు నవ్వుకుంటు న్నావు. ఎంతకాలం భోషాణంలో ఉంటావో ఉండు," అన్నాడు.

ఇది జరిగిన కొద్ది రోజులకే సోమగిరి ఇంటికి ఒక దూరపుబంధువు వచ్చాడు. అతడు సోమగిరితో కొంచెం సేపు కబుర్లాడి, మళ్ళీ బయలుదేరాడు.

"భోజనం చేసి పోగూడదా?" అన్నాడు సోమగిరి బంధువుతో.

ఆ బంధువుకు సోమగిరి సంగతి తెలుసు, అందుచేత అతను, "వద్దులే. పోవలసిన దూరం కానా ఉంది," అంటూ బయలుదేరాడు. అతను సోమగిరి ఇల్లు దాటి పదిఅడుగులు వేశాడో లేదో, పలుపు తెంచుకుని పారిపోతున్న పోట్లగొడ్డొకటి అతన్ని కుమ్మి పడదోసి, కాలు తొక్కి పారి పోయింది. కాలు విరిగిన బంధువును

సోమగిరి తన ఇంట్లోకి తెచ్చి నెలరోజుల పాటు ఉంచుకోవలిసివచ్చింది. సోమగిరి తన బంధువును ఇంట్లోకి తీసుకొస్తుండగా భోషాణంలో ఉన్న యక్షుడు రెండోసారి వికావికా నవ్వాడు. సోమగిరి విననట్టు నటించి ఊరుకున్నాడు.

ఇంకొక నెల గడిచింది. ఒకనాడు సోమగిరి సంతకు వెళ్ళాడు. అతను తన డబ్బంతా నేలలో ఒక చోట పాతి ఉంచాడు—ఆ కాలంలో డబ్బు జాస్తిగా ఉన్నవా రందరూ అలాగే చేసేవారు. సోమగిరి డబ్బు పాతిపెట్టిన చోటికి వెళ్ళి, కొంత డబ్బు తవ్వి తీసుకుని, మిగతాది మళ్ళీ పూడ్చి పెట్టి, సంతకు వెళ్ళిపోయాడు. ఇది ఎవడో గమనించి, సోమగిరి వెళ్ళిపోయాక, అక్కడ తవ్వి, పాతిపెట్టిన డబ్బంతా తీసుకుని గుంట జాగ్రత్తగా పూడ్చి, తన దారిన తాను వెళ్ళాడు.

సాయంకాలమయాక సోమగిరి, సంతలో కొన్న సరుకులతో సహా ఇంటికి తిరిగివచ్చేసరికి, భోషాణంలో వున్న యక్షుడు పగలబడి నవ్వ నారంభించాడు.

సోమగిరికి చాలా కోపం వచ్చింది. అతను భోషాణపు తాళం చెవి తెచ్చి, భోషాణం తెరిచి, యక్షుణ్ణి పట్టుకు పైకిలాగి, "రెండు నెలలుగా నిన్ను నిర్బంధంలో ఉంచినా



నుధు నాకు ఉపకారం చెయ్యకపోగా విరగబడి నవ్వావు. ఇప్పటికి మూడుసార్లు నవ్వావు. నీ నవ్వుకు కారణం చెప్పక పోయావో, నిన్ను గొంతుపిసికి చంపేస్తాను. చెప్పు, నీ నవ్వులకు కారణమేమిటి?" అని అడిగాడు.

"ఒక రోజు నీ కొక చెక్కిన దుంగ దొరికింది. దాన్ని నువు శరభయ్యకు రెండు రూపాయలకు అమ్మావు. వట్టి మందమతివి కావటంచేత అందులో లక్షలకు విలువైన బంగారమూ, రత్నాలూ ఉన్నట్టు తెలుసుకోలేక పోయావు. శరభయ్య వాటిని తీసుకుని, లక్షాధికారి అయి, హాయిగా బతుకుతున్నాడు. నీ మందబుద్ధి చూస్తే నాకు నవ్వొచ్చింది," అన్నాడు యక్షుడు.

సోమగిరికి ఈ మాట వినేసరికి మతిపోయినట్టయింది. "రెండోసారి మా బంధువు కాలు విరిగినప్పు డెందుకు నవ్వావు?" అని అతను యక్షుణ్ణి అడిగాడు.

"నీ తెలివి తక్కువకే నవ్వాను. రాక రాక వచ్చిన బంధువుకు భోజనం పెట్టి పంపినట్టయితే అతనికి ఆ అపాయం తప్పేది. నువ్వతని భారం నెలరోజులు మోసే అవసరం ఉండేది కాదు," అన్నాడు యక్షుడు.

"మరి ఇప్పుడెందుకు నవ్వుతున్నావు?" అన్నాడు సోమగిరి.

"ఎందుకంటే, నువు పాతి పెట్టిన డబ్బంతా దొంగ కాజేసుకు పోయాడు. నువు పొద్దున అందులో కొంత తవ్వి తీసేటప్పుడు ఆ దొంగ గమనించాడు. అది కూడా నీకు తెలియదు. నీ అంత తెలివితక్కువ వాణ్ణి నే నెక్కడా చూడలేదు," అన్నాడు యక్షుడు.

"నా డబ్బంతా పోయిందా?" అని గట్టిగా అరిచి సోమగిరి తాను డబ్బు పాతిపెట్టిన చోటికి వెళ్ళాడు. ఒక్క రాగినాణెం కూడా మిగలకుండా అంతా పోయింది. సోమగిరి ఏడుస్తూ ఇంటికి తిరిగి వచ్చేసరికి యక్షుడు కూడా లేడు.





# వెర్రి వెంకి

ఒక గ్రామంలో ఒక రైతుండే వాడు. అతనికి చిన్నతనంలోనే భార్య పోయింది. గ్రామంలో వెంకి అనే దిక్కులేని పిల్ల ఒకతె ఉండేది. రైతు దాని చేత ఇంటిపని అంతా చేయించుకునేవాడు. తీరికగా ఉన్నప్పుడు అది మిగతా కూలీలతో కలిసి పొలం పనులు కూడా చేసేది. పని చెయ్యటంలో వెంకికి అలుపూ, సలుపూ అంటూ లేదు. కాని దానికి వేపకాయంత వెర్రి ఉండేది.

"ఇంటి పనంతా నేనే చేస్తుంటినిగదా, నన్ను పెళ్ళి చేసుకోరాదా ఏం?" అనేది వెంకి తన యజమానితో.

"చేసుకోక చేసుకోక నిన్నే చేసుకోమన్నావుటే?" అనేవాడు రైతు.

కాని వెంకి అస్తమానమూ ఇదే పాట సాగించింది. "నన్నెందుకు చేసుకోవు? నాకేం వెంకొచ్చింది? నేనుండగా ఇంకొకతెను ఈ ఇంట్లో అడుగు పెట్టనిస్తానా?" అంటూ అది తన యజమానిని కాల్చుకు తిన్నది. దాని బాధ భరించలేక రైతు, ఒకనాటి మధ్యాహ్నం, వెంకి పొలం పని చేసి అలిసి చేనులోనే పడుకుని ఒళ్ళు తెలియకుండా నిద్రపోతుంటే, దాని ఒంటి నిండా నూనె కలిపిన కాటుక పట్టించేశాడు.

పొద్దువాలే సమయానికి వెంకి నిద్రలేచి, తన కాళ్ళూ చేతులూ చూసుకుని తానే భయపడింది. "నేను నేనా లేక దయ్యమా?" అని దానికి అనుమానం వచ్చింది. అది తిన్నగా తన యజమాని ఇంటికి వెళ్ళి, "వెంకి ఇంటో ఉందా, బాబూ?" అని అడిగింది.

"ఆ, ఇంటోనే ఉంది," అన్నాడు రైతు, ఇక తనకు దాని పీడ వదిలిందనుకుని.

"అయితే నేను వెంకిని కానన్న మాటేగా?" అనుకుంటూ వెంకి మసక చీకట్లోపడి, అడివి కేసి బయలుదేరింది.

కె. శ్రీనివాసులు



అడవిలో దానికి ఇద్దరు దొంగలు కని పించారు. వాళ్ళు దాన్ని చూసి భయపడి పారిపోసాగారు.

"ఎందుకురా, వెర్రి నాగన్నల్లారా, పారి పోతారు? దొంగతనానికి పోతుంటే నన్ను వెంట బెట్టుకు పొండి, సహాయంగా ఉంటాను," అని వెంకి కేక పెట్టింది.

పిశాచి తమ వెంట ఉండటం కూడా ఒక విధంగా మంచిదే ననుకుని, దొంగలు భయపడటం మాని, వెంకి దగ్గిరికి వచ్చారు. వాళ్ళు ఎక్కడన్నా ఒక గొర్రెను దొంగి లించాలని ఉన్నారు, కాని ఎక్కడ గొర్రె దొరుకుతుందో వాళ్ళకు తెలీదు.

"అదంతా నాకు వదిలి పెట్టండి. కటిక చీకట్లో కూడా గొర్రెల కొట్టానికి పోగలను," అన్నది వెంకి. దొంగలు సంతోషించి వెంకి వెంట వచ్చారు. దొంగలను బయట ఉండ మని వెంకి కొట్టం ప్రవేశించింది. దొంగలు గొర్రె కోసం ఎదురు చూస్తూండగా వెంకి, "పోతు కావాలా? పెంటి కావాలా? ఇక్కడ బోలెడన్ని గొర్రెలు!" అని గావు కేక పెట్టింది.

"అరవకు! బలిసినదిగా చూసి ఏదో ఒకటి పట్రా!" అన్నారు దొంగలు.

"బలిసినదే! పోతు కావాలా? పెంటి కావాలా?" అని వెంకి మరింత గట్టిగా అరిచింది.

"అరుస్తావెందుకు? బలిసినదైతే పోతయినా సరే, పెంటి అయినాసరే!" అన్నారు దొంగలు.

"ఇక్కడ బోలెడన్ని గొర్రెలు. పోతు కావాలా? పెంటి కావాలా? ఏది కావాలంటే అదే ఉన్నది," అని వెంకి మరింత గట్టిగా అరిచింది.

"నోరు మూసుకుని ఏదో ఒకటి పట్టు కురా!" అన్నారు దొంగలు.

ఈలోపుగా గొర్రెల యజమాని వెంకి పెట్టిన గావు కేకలకు లేచి బయటికి వచ్చాడు. దొంగలు కాలికి బుద్ధి చెప్పారు.

"ఉండండ్రా! ఆగండ్రా!" అంటూ వెంకి గొర్రెల మధ్యనుంచి పరిగెత్తుకుంటూ వచ్చింది. వెంకిని చూడగానే గొర్రెలయజ మాని భయంతో కొయ్యబారి పోయి, తన మందలోకి పిశాచి వచ్చిందనుకున్నాడు.

ఆ రోజు దొంగలకూ, వెంకికీ తిండిలేదు. మర్నాడు చీకటి పడగానే వాళ్ళు ఒక కోడిని తస్కరించటానికి బయలు దేరారు. కాని కోడి ఎక్కడ దొరికేదీ వాళ్ళకు తెలీదు.

"అదంతా నాకు వదలండి. నాకు ఊళ్ళో ఉండే కోళ్ళగూళ్ళన్నీ బాగా తెలుసు," అని వెంకి వాళ్ళను వెంట బెట్టుకుని ఊళ్ళోకి వచ్చింది. అది దొంగలను బయట ఉండ మని కోళ్ళ ఆవరణలో ప్రవేశించి, "పెట్ట కావాలా? పుంజు కావాలా? ఇక్కడ బోలె డన్ని కోళ్ళు," అని గావు కేక పెట్టింది.

"అయితే పాలి కేకలు దేనికి? బరువుగా ఉన్న కోడిని చూసి పట్టుకురా!" అన్నారు దొంగలు.

"అదే, పెట్ట కావాలా? పుంజుకావాలా?" అని వెంకి మళ్ళీ గావుకేక పెట్టింది.

"కేకలు పెట్టక, వాటమైన కోడి నొక దాన్ని తీసుకురా," అన్నారు దొంగలు.

"అట్లా కాదు, పుంజు కావాలా? పెట్ట కావాలా? ఇక్కడ బోలెడన్ని కోళ్ళు!"



అన్నది వెంకి. ఈ కేకలకు కోళ్ళన్నీ లేచి అరవసాగాయి. కాపలావాడు లేచాడు. దొంగలు పరుగు లంకించుకున్నారు.

"ఆగండ్రా, బుద్ధి తక్కువ వాళ్ళల్లారా! పుంజు కావాలంటే పుంజో, పెట్ట కావాలంటే పెట్టో ఇచ్చేదాన్నిగదా! ఏదీ చెప్పక పోతిరి!" అంటూ వెంకి వాళ్ళ వెనకే పరిగెత్తింది.

వెంకిని చూస్తూనే కోళ్ళ కాపలావాడు భయంతో విరుచుకు పడిపోయాడు.

రెండు రోజులుగా దొంగలకు తిండిలేదు. ఊళ్ళోనేమో పిశాచం తిరుగుతున్న వార్త వ్యాపించి అందరూ హడలిపోతున్నారు. మూడోరోజు నిశిరాత్రి దొంగలు ఎక్కడన్నా

ఒక గొర్రె దొరుకుతుందేమో చూడటానికి బయలుదేరారు. వెంకి వెంట వస్తానంటే వాళ్ళు వద్దనేశారు. ఆ పిశాచాన్ని వెంట బెట్టుకుపోతే తమకు ఆకలిచావు తప్పదని వెంగలకు తోచిపోయింది.

వెంకికి కూడా ఆకలి దహించుకు పోతున్నది. అందుచేత అది ఊరి బయట ఉన్న ఒక పొలానికి వెళ్ళి, అక్కడ చిలగడ దుంపలు పీకి అవురావురని తినసాగింది. పొలంలోనే గుడిసె వేసుకుని ఉన్న పొలందారు ఒక రాత్రివేళ బయటికి వచ్చి, చిలగడదుంపలు పీక్కు తింటున్న వెంకిని చూసి, దయ్యమనుకుని, అప్పటికప్పుడే భూతవైద్యుడి ఇంటికి పరిగెత్తాడు.

భూతవైద్యుడు నిద్రలేచి పై పంచె వేసుకుని, పొలందారు వెంట బయలుదేరాడు. పొలంలోకి రావాలంటే దారిలో రొంపి అడ్డున్నది. భూతవైద్యుడు రొంపిలో దిగి నడవనన్నాడు.

"నేను నిన్ను ఎత్తుకుని రొంపి దాటిస్తా. ఈ దయ్యాన్ని నువ్వు వదలగొట్టకపోతే ఇక నేను మూటెత్తుకోవాలిసిందే!" అంటూ పొలం దారు భూతవైద్యుణ్ణి వీపున ఎత్తుకుని రొంపిలోకి దిగి నడవసాగాడు.

పొలంలో నుంచి వెంకి వాళ్ళను చూసి వెంగలనుకున్నది. వాళ్ళు గొర్రెను సంపాదించు కొస్తున్నారనుకుని, "బాగా కొవ్విన దేనా?" అని గట్టిగా అరిచింది.

పొలందారు రక్తం గడ్డకట్టుకు పోయింది. "కొవ్వింద కాదె నువే చూసుకో, మాతల్లీ!" అంటూ వాడు భూతవైద్యుణ్ణి రొంపిలోకి తోసేసి, కాలిసత్తువ కొద్దీ పారిపోయాడు.

ఆ రాత్రి జరిగిన సమాచారం కూడా రైతుకు తెలిసింది. అతనికి వెంకిని చూసి జాలి వేసింది. అందుచేత అతను దాని కోసం అంతటా వెతికి, చక్కగా స్నానం చేయించి, పురోహితుణ్ణి పిలిపించి, తానే పెళ్ళి చేసేసుకుని, సుఖంగా ఉన్నాడు.





# పుత్రుడి కర్తవ్యం

ఒకసారి పాపన్న తన యింటికి సున్నం కొట్టించటానికి పాత సామానులన్నీ సర్దు తూండగా, ఒక పెట్టె అడుగున ఒక కాగితం మడత కనబడింది. దాన్ని విప్పి చూస్తే, ఇలా రాసి ఉన్నది: "గుర్రంపల్లి వెంకట సుబ్బయ్యకు నేను ఇవ్వవలసిన నా ప్రాణం వెల నూరురూపాయలూ, నా చికిత్సకు గాను మందు మాకుల కింద ఇవ్వవలసినది పదిహేను రూపాయలూ, వెరశి నూట పది హేను రూపాయలు."

ఆ కాగితంలోని దస్తూరి పాపన్న తండ్రి అయిన సోమయ్యది. తన తండ్రి ఎవరో వెంకటసుబ్బయ్య అనే గుర్రంపల్లి కాపు రస్థుడికి నూట పదిహేను రూపాయలు బాకీ పడ్డాడన్నంతవరకే పాపన్నకు అర్థమయింది గాని, ఆ బాకీ తాలూకు వివరాలు ఏమీ అర్థం కాలేదు. అందుచేత అతను ఆ కాగి తంలో రాసి ఉన్నమాటలు తన తల్లికి వినిపించి, "ఈ వెంకటసుబ్బయ్య ఎవరో, ఈ బాకీ ఏ బాపతో నీకేమైనా తెలుసునా, అమ్మా?" అని అడిగాడు.

తల్లి కాస్సేపు ఆలోచించి, "ఆఁ! కొంచెం కొంచెం జ్ఞాపకం వస్తున్నదిరా. అయితే ఆ బాకీ తీరనే లేదన్నమాట! నాకేం తెలుస్తుంది? నాతో ఏమీ చెప్పేవారూ చేసే వారూ కారాయె. ఎప్పుడో ముప్పై ఏళ్ళ క్రితం, నువు మూడేళ్ళ వాడవుగా ఉన్న ప్పటి సంగతి," అంటూ ఈ దిగువ సంఘ టన గురించి చెప్పింది.

పాపన్న తండ్రి సోమయ్య చాలా బీదగా జీవితం గడిపాడు. కొద్దిపాటి పొలం ఉండేది. అందుచేత ఎక్కడన్నా భోజ నమూ, దక్షిణ డబ్బులూ దొరుకుతాయంటే, సోమయ్య ఎంతదూరమైనా వెళ్ళేవాడు.

అలాగే ఒకసారి సోమయ్య, రాజధానిలో ఒక రాజోద్యోగి ఇంట పెళ్ళి అయితే




వెళ్ళాడు. అక్కడ భోజనం చేసి, దక్షిణ పుచ్చుకుని తిరిగి వచ్చేటప్పు డాయనకు వెంకటసుబ్బయ్య అనే ఆయన తోడుదొరి కాడు. ఆ వెంకటసుబ్బయ్యది గుర్రంపల్లి అనే గ్రామం. ఆయన కూడా పెళ్ళికి వచ్చినవాడే. ఇద్దరిదీ ఒకేదారి గనక, కబుర్లు చెప్పుకుంటూ, ప్రయాణం చేశారు.

వాళ్ళు గుర్రంపల్లిని చేర వస్తుండగానే బాగా చీకటి పడింది. ఆ సమయంలో ఏ చెట్టు చాటునుంచో ఒక దొంగ వాళ్ళ ముందుకు వచ్చి, చేతికర్రతో ఇద్దరి కాళ్ళ మీదా బలంగా కొట్టాడు. అయితే దెబ్బ సోమయ్యకే బలంగా తగిలింది. ఆయన



పడి పోయాడు. తరవాత దొంగ ఆ ఇద్దరినీ చెరొక చెట్టుకూ కట్టి, ఇద్దరి దగ్గిర ఉన్న డబ్బూ లాగేసుకుని, "మీలో ఎవడు వెళ్ళి వందరూపాయలు తెచ్చి ఇచ్చినా రెండోవాణ్ణి కూడా విడిచి పెడతాను. చెప్పండి. ఎవరు వెళ్ళి డబ్బు తెస్తారు? డబ్బు తేబోయిన వాడు తెల్లారేలోగా డబ్బు తేకపోయినా, వెంట ఎవరినన్నా తోడు తెచ్చినా, ఇక్కడ ఉండేవాణ్ణి పొడిచి చంపేస్తాను," అన్నాడు.

ఇద్దరు మనుషులు కలిసి దొరికారు గనక దొంగ ఈ ఎత్తు వేశాడు. అదే ఒంటరి ప్రయాణీకుడై ఉంటే దగ్గిర ఉన్నది కాజేసి, దొంగ తృప్తిపడేవాడే. కాని ఇద్దరుగా దొరి కారు గనక వాడి ఎత్తు పారింది. ఎవరో ఒకరు వెళ్ళి, నూరురూపాయలూ తెచ్చి, ఆ దొంగ మొహాన కొట్టి రెండోవాణ్ణి విడిపించాలి. సోమయ్య ఉండే గ్రామం చాలా దూరం. అక్కడికి వెళ్ళటానికే ఒక రోజు పట్టుతుంది. తెల్లవారేలోపుగా తిరిగి రావటం అసంభవం. ఒకవేళ తిరిగి వచ్చినా సోమయ్య ఇంట చిల్లి గవ్వలేదు; నూరు రూపాయలు ఎలా తెస్తాడు?

"మా గ్రామం దగ్గిరలోనే ఉన్నది. నన్ను వదిలిపెట్టు. నేను డబ్బు పట్టుకొస్తాను," అన్నాడు వెంకటసుబ్బయ్య దొంగతో.

దొంగ వెంకటసుబ్బయ్య కట్లు విప్పి, వెళ్ళి పోనిచ్చాడు. అలా దొంగబారి నుంచి తప్పించుకుని బయటపడిన వెంకట సుబ్బయ్య తనను విడిపించటానికి నూరు రూపాయలతో తిరిగి వస్తాడని సోమయ్య కలలో కూడా అనుకోలేదు. అతనన్నా తప్పించుకు పోయాడు గదా అని సంతో షిస్తూ, తెల్లవారే లోపల తన చావు ఖాయం చేసుకున్నాడు సోమయ్య. ఆయనకు దైవ ధ్యానం చేస్తూ చావుకోసం ఎదురు చూడటం తప్ప ఇంకేమీ మిగలలేదు.



కాని తెల్లవారక ముందే వెంకటసుబ్బయ్య తిరిగి వచ్చాడు; "ఇదుగోనయ్యా, నూరు రూపాయలు! ఆయనను వదిలిపెట్టి డబ్బు తీసుకో!" అన్నాడు. దొంగవాడు డబ్బు తీసుకుని ఎటో మాయమయాడు.

దారిలో కలిసిన స్నేహాన్ని పాటించి, నూరురూపాయలూ తెచ్చి దొంగకు సమ ర్పించి, తన ప్రాణం కాపాడిన ఆ వెంకట సుబ్బయ్యకు తన కృతజ్ఞత ఎలా తెలపాలో సోమయ్యకు తెలియలేదు. అంతటితో ఆగక, వెంకటసుబ్బయ్య సోమయ్య బరు వంతా తన మీద వేసుకుని, నడిపించు కుంటూ తన ఇంటికి తీసుకుపోయి, నాలుగు రోజులపాటు తన ఇంటనే ఉంచుకుని, ఆయనకు చికిత్స చేయించి, దెబ్బతిన్న కాళ్ళు నయం చేయించాడు.

చిత్ర మేమిటంటే, వెంకటసుబ్బయ్యదీ బీదసంసారమే. అతను నూరురూపాయలూ ఆ రాత్రికి రాత్రి ఎలా పుట్టించాడో సోమయ్యకు అర్థం కాలేదు. ఆ నూరు రూపాయలూ, తన చికిత్సకయిన ఖర్చు పదిహేను రూపాయలూ వెంకటసుబ్బ య్యకు ఎలా తిరిగి ఇవ్వాలో కూడా సోమయ్య ఊహించలేక పోయాడు. ఆయన తన గ్రామానికి బయలుదేరుతూ, సాధ్య మైనంత త్వరలో నూటపదిహేను రూపా యల బాకీ తీర్చేస్తానని మాట ఇచ్చి,



చూసేవాడు కాదు. అదీగాక, ఆ రోజుల్లో మగవాళ్ళు డబ్బు గురించిన విషయాలు ఆడవాళ్ళతో చర్చించేవాళ్ళు కారు. ఆఖరి సారి జబ్బుపడినప్పుడు కూడా సోమయ్యకు నోరు పడిపోయింది. అందుచేత భార్యతో ఆయన ఏమీ చెప్పే అవకాశం లేక పోయింది.

ఈ సంగతులన్నీ విని పాపన్న చాలా బాధపడ్డాడు. తన తండ్రి రుణం ఇంత కాలంగా తీరకుండా ఉన్నదా? తండ్రి రుణాలు తీర్చటం పుత్రుడి కర్తవ్యం. తన తండ్రి రుణం తాను తీరిస్తేనే గాని ఆయనకు ఆత్మశాంతి ఉండదు.

పాపన్న లెక్కకట్టాడు. తన తండ్రి ఇవ్వవలసిన బాకీ వడ్డీతో సహా అయిదు వందలు దాటుతుంది. అందుచేత పాపన్న వెంటనే కొంత పొలం అమ్మి, డబ్బు చేత పట్టుకుని, దారి వెతుక్కుంటూ గుర్రంపల్లి చేరుకున్నాడు. అది పెద్దగ్రామమే. అక్కడ పాపన్న వెంకటసుబ్బయ్య గురించి అడిగితే, ఒక మనిషి, "వెంకటసుబ్బయ్యగారంటే గ్రామాధికారిగా ఉండినాయన కాదుటండీ? ఆయన ఇప్పుడున్నట్టు లేదే!" అన్నాడు.

పాపన్న గ్రామాధికారి ఇల్లు వెతుక్కుంటూ వెళ్ళాడు. ప్రస్తుతం శీనయ్య అనేవాడు గ్రామాధికారిగా ఉంటున్నాడు.

వెంకటసుబ్బయ్య దగ్గిర సెలవు తీసుకున్నాడు. సోమయ్య ఇంటికి వచ్చి జరిగినదంతా తన భార్యకు చెప్పాడు. తాను వెంకటసుబ్బయ్య ఇంట తన చెంబు మరచి వచ్చిన సంగతి భార్య అడిగిన దాకా సోమయ్యకు గుర్తు రాలేదు.

ఈ సంఘటన జరిగిన తరవాత సోమయ్య రెండేళ్ళు మాత్రమే జీవించాడు. ఆ వెంకటసుబ్బయ్య బాకీ తీరిందో లేదో పాపన్న తల్లి ఎరగదు. సోమయ్య ఇంటి పట్టున ఉండిన మనిషి కాదు. అస్తమానమూ ఎటో వెళ్ళేవాడు. ఇల్లు దాటి వెళితే నాలుగైదు రోజుల దాకా తిరిగి ఇంటి ముఖం

అతను పాపన్న పేరు ఆదివరకే విని ఉండటం చేత, మర్యాద చేసి, పాపన్న వచ్చిన పని అడిగాడు.

పాపన్న తన తండ్రి ఋణం గురించీ, వెంకటసుబ్బయ్య గురించీ చెప్పి, "మా తండ్రిగారు మీ తండ్రిగారికి 115 రూపాయలు బాకీ ఉన్నట్టు నాకింత కాలమూ తెలియనే తెలియదు. గడిచిన ముప్పైఏళ్ళ చిల్లరకూ వడ్డీకట్టి పైకం తెచ్చాను. పుచ్చుకోండి," అన్నాడు.

శీనయ్య డబ్బు తీసుకోవటానికి వెనకాడుతూ, "వద్దు లెండి. మీ నాన్నగారికి మా నాన్నగారిచ్చినది అప్పుగా భావించనవసరం లేదు. మీ తండ్రిగారి ప్రాణాన్ని కాపాడటమే ఒక గొప్ప సంగతి. కాని మీ పుత్రధర్మం మటుకు ఎంతో మెచ్చుకో తగ్గది," అన్నాడు.

"మీ తండ్రిగారు ఏమనుకుని సహాయపడ్డారో తెలియదుగాని, మా తండ్రిగారు మాత్రం దాన్ని ఋణంగానే భావించారు. ఆ సంగతి తెలిసేకద నేనీ డబ్బు తెచ్చాను," అన్నాడు పాపన్న.

శీనయ్య, బలవంతంమీద పాపన్న యిచ్చిన డబ్బు తీసుకుంటూ, "సరే, మీరంతగా కాదు, కూడదంటున్నారు గనక




ఈ డబ్బు తీసుకుని ఏ ధర్మకార్యానికైనా వినియోగిస్తాను," అని, డబ్బుకు రశీదు ఇచ్చేశాడు.

పాపన్న శీనయ్య వద్ద శలవు పుచ్చుకుంటూ, "అన్నట్టు, మా తండ్రిగారు మీ ఇంట ఒక చెంబు వదిలి పెట్టారట. అది ఉన్నదేమో చెప్పగలరా?" అన్నాడు.

శీనయ్య ఆశ్చర్యపోయి, "చెంబా! పాత సామానులో చూసి చెబుతాను, ఉండండి," అని లోపలికి పోయి, బాగా కిలుమెక్కి ఉన్న చిన్న రాగిచెంబొకటి తెచ్చి, "ఇదేనండీ మీ తండ్రిగారి చెంబూ," అంటూ పాపన్న కిచ్చాడు.



పాపన్న దాన్ని భక్తితో స్వీకరించి తన ఊరికి తిరుగు ప్రయాణమయాడు. అతను ఊరుదాటి అడవి మార్గాన కొంతదూరం నడిచేసరికి ఒక చెట్టుకింద ముసలిసన్యాసి కూర్చుని కనిపించాడు. ఈ సన్యాసిని పాపన్న వచ్చేటప్పుడు కూడా చూశాడు. అయితే, ఇప్పుడా సన్యాసి ముందు ఇద్దరు పిల్లలూ, ఒక ఈడు వచ్చినవాడూ చింకి పాతలు కట్టుకుని నిలబడి ఉన్నారు. పెద్ద వాడు ఏడుపు గొంతుతో, "ఒక్కసారి ఇంటికి వచ్చి అమ్మను చూడు, నాన్నా," అని బతిమాలు తున్నాడు. వాడి వెంట ఉన్న చిన్న పిల్లలు, "ఇంటికిరా, తాతా," అని ఏడుస్తున్నారు. సన్యాసి వాళ్ళ మొర వినిపించుకున్నట్టు కనబడలేదు.

పాపన్న అక్కడ ఆగి, వాళ్ళను ప్రశ్నించి, వాళ్ళ గొడవంతా తెలుసుకున్నాడు. ఇంతకూ ఈ ముసలిసన్యాసే తన తండ్రిని ఆనాడు కాపాడిన వెంకటసుబ్బయ్య! ముప్పైఏళ్ళ క్రితం కుగ్రామంగా ఉండిన గుర్రంపల్లికి ఈయనే గ్రామాధికారీ, కరణమూ, అన్నీనూ. వాళ్ళది నిజంగా బీదకుటుంబమే. దివాణానికి కట్టవలిసిన కిస్తీ పైకం వంద రూపాయలు ఇంట్లో ఉంటే అది తీసుకు పోయి దొంగ కిచ్చి, సోమయ్య ప్రాణం దక్కించాడు. కాని ఆ డబ్బు మళ్ళీ పూడ్చటం ఆయనతరం కాలేదు. సోమయ్య అయినా ఆ డబ్బు పుట్టించి ఆయనకు ఇవ్వలేక పోయాడు.

కిస్తీ కట్టవలసిన రోజు దగ్గిర పడుతున్న కొద్దీ వెంకటసుబ్బయ్య ఊళ్ళో అందరినీ అప్పు అడగసాగాడు. శీనయ్య తండ్రికి వెంకటసుబ్బయ్య అంటే పడదు. వెంకట సుబ్బయ్య పరిస్థితి ఊహించి, ఆ దుర్మార్గుడు, వెంకటసుబ్బయ్య కిస్తీసొమ్ము అపహరించాడని దివాణానికి కబురు చేశాడు. అధికార్లు వచ్చి వెంకటసుబ్బయ్యను విచారణ జరిపారు. దివాణానికి కట్టవలిసిన

సొమ్ము దొంగ కిచ్చానని చెప్పటం వెంకటసుబ్బయ్యకు సాధ్యం కాలేదు. అధికార్లు అతన్ని ఉద్యోగం నుంచి తొలగించి, అతని ఆస్తి జప్తు చేసి, అతన్ని గ్రామం నుంచి బహిష్కరించారు. శీనయ్య తండ్రి గ్రామాధికారి అయాడు.

జరిగినదానికి వెంకటసుబ్బయ్య వైరాగ్యం చెంది, అడవిలో ఆశ్రమం వేసుకుని, సన్యాసిజీవితం గడపసాగాడు.

ఇప్పుడు వెంకటసుబ్బయ్య భార్య మంచంపట్టి, ఇవాళో రేపో అన్న స్థితిలో ఉండి, భర్తను ఒకసారి చూడాలని తపించి పోతున్నది. అందుకే కొడుకూ, మనమలూ వచ్చి, వెంకటసుబ్బయ్యను ఇంటికి రమ్మని ప్రాధేయపడుతున్నారు.

అంతా విని పాపన్న నిర్ఘాంతపోయాడు.

"మా నాన్న మీ ఇంట చెంబు ఒకటి వదిలిపెట్టాడా?" అని అతను వాళ్ళను అడిగాడు.

"అవునండీ, చెంబు మా ఇంట ఉన్నది. మా కష్టా లన్నిటికీ మూలకారకుడైన ఆ పెద్ద మనిషి చెంబును మరవపచ్చునా? ఆ చెంబే తీసుకుని వారింటికే ఇచ్చానికి వెళ్ళమని మా అమ్మ ఎన్ని సార్లో అన్నది. కాళ్ళూ చేతులూ పడిపోయాక అలాగే వెళతానని



ఆవిడకు సమాధానం చెప్పాను," అన్నాడు వెంకటసుబ్బయ్య కొడుకు.

పాపన్న తన సంగతంతా వాళ్ళకు చెప్పాడు. అతను సన్యాసితో, "అయ్యా, మీరు సన్యాసిగానే ఉండి పోతారో, తిరిగి గృహస్థు అవుతారో అది మీ ఇష్టం. కాని నేనుమటుకు మీ అబ్బాయిని తిరిగి గ్రామాధికారి చేస్తే తప్ప నా తండ్రి ఆత్మకు శాంతి ఉండదు," అన్నాడు.

అతను వెంకటసుబ్బయ్య కొడుకునూ, మనమలనూ వెంట బెట్టుకుని, వారుంటున్న గుడిసెకు వెళ్ళాడు. వెంకటసుబ్బయ్య భార్య పాపన్న చెప్పినదంతా విని చాలా

ఉత్సాహం తెచ్చుకుని, తన జబ్బు సగం నయమైనట్టే తలపోసింది. అక్కడ పాపన్న తన తండ్రి చెంబు తీసుకుని వెంకట సుబ్బయ్య కొడుకును వెంట పెట్టుకుని శీనయ్య ఇంటికి వెళ్ళాడు.

శీనయ్య పదిమందితో కూర్చుని ఏవో వ్యవహారాలు మాట్లాడుతున్నాడు. పాపన్న అతన్ని చూసి, "శీనయ్యగారూ, నేను పొర పాటు పడితే మీరు నన్ను సరిదిద్దలేదు. వెంకటసుబ్బయ్యగారు మీ తండ్రిగారు కాదు. మా తండ్రి రుణపడింది మీ తండ్రి గారికి కాదు. మీరిచ్చిన చెంబు మా తండ్రిది కాదు. ఇదుగో మా తండ్రిగారి చెంబు. దీనిమీద 'సోమయ్య' అని మా తండ్రిగారి పేరు కూడా ఉన్నది. ఈ అబ్బాయి వెంకట సుబ్బయ్యగారి అబ్బాయి. నేను మీ కిచ్చిన డబ్బు ఈ అబ్బాయికి చేరాలి. అందుచేత ఆ డబ్బు నాకు తిరిగి ఇచ్చెయ్యండి. ఇదుగో మీరిచ్చిన రశీదు," అన్నాడు.

శీనయ్య వెలాతెలా పోయాడు. "ఏమిటి? ఏమిటి?" అని అందరూ అడిగారు. శీనయ్య ఏమని చెబుతాడు? మారు మాటాడకుండా పాపన్న డబ్బు పాపన్న కిచ్చేశాడు.

పాపన్న ఆ డబ్బు తెచ్చి వెంకట సుబ్బయ్య భార్యదగ్గిరపెట్టి, "ఇది మీడబ్బే. జబ్బుకు మంచి వైద్యం చేయించుకోండి. అవసరమైన ఖర్చులన్నీ ధారాళంగా చేసుకోండి. నేను మళ్ళీ వస్తాను," అని చెప్పి, బయలుదేరి దివాణానికి వెళ్ళాడు.

వెంకటసుబ్బయ్య సంగతంతా పాపన్న చెప్పిన మీదట అధికార్లు పాతరికార్డులన్నీ తిరగదోడి, ముప్పైఏళ్ళ తరవాత మళ్ళీ వెంకటసుబ్బయ్య కుటుంబానికి గ్రామాధికారం ఇప్పించారు. వెంకటసుబ్బయ్య కొడుకు గ్రామాధికారి కాబోతున్నాడని ముందుగానే పసి కట్టి శీనయ్య తన పదవికి రాజీనామా పెట్టేసి, విచారణనుంచి తప్పించుకున్నాడు.





# మనుష్యయత్నం

ఒక ఊళ్ళో ఒక గొర్రెలకాపరి ఉండేవాడు. వాడొకరోజు సంతకు వెళ్ళవలిసి వచ్చింది. తన మందను చూస్తూ ఉండ మనటానికి వాడి కెవరూ దగ్గిరవాళ్ళు గాని, ఇరుగు పొరుగువాళ్ళు గాని లేరు. అందుచేత వాడు దేవుడి పైన భారంవేసి, బీడులో మేస్తున్న మందను వదిలి సంతకు బయలుదేరాడు.

గొర్రెలకాపరి కొంతదూరం వెళ్ళే సరికి, సంత నుంచి తిరిగి వస్తూ ఎరిగిన వాడొకడు కనబడి, "ఎక్కడికి బయలుదేరావు, అన్నా?" అని అడిగాడు.

"సంతలో పనుంది. తప్పని సరి అయి పోతున్నా," అన్నాడు గొర్రెలకాపరి.

"మరి మంద నెవరు చూస్తున్నారు?" అన్నాడు ఎరిగున్నవాడు.

"ఎవరున్నారు చూడటానికి? దేవుడే చూస్తాడు," అంటూ గొర్రెలకాపరి గబాగబా ముందుకు సాగాడు.

"దేవుడేం చూస్తున్నాడో నేను చూస్తాను," అనుకుని రెండోవాడు గొర్రెల మందను సమీపించి, బాగా కొవ్విన గొర్రెలను ఇరవై అయిదింటిని ఏరుకుని, వాటిని తన ఊరు తోలుకుపోయాడు.

గొర్రెలకాపరి సంతకు పోయి, అక్కడ తన పని చూసుకుని, తిరిగి వచ్చే సరికి మందలో పాతిక గొర్రెలు తరుగైనట్టు తెలిసింది. వాడు దీర్ఘంగా నిట్టూర్చి, "గొర్రెలను కాసే పని దేవుడి మీద వేసి లాభంలేదు," అనుకున్నాడు.

ఇలా అనుకుని వాడు తన గొర్రెలను కాయటానికి రెండు కుక్కలను కొన్నాడు. ఆ కుక్కలను అమ్మినవాడు ఆ కుక్కలకు రోజూ రెండేసి పలాల మాంసం వెయ్యమన్నాడు. అందుకని గొర్రెలకాపరి తన కుక్కలకు రోజూ రెండేసి ఎలుకలను వేస్తూ వచ్చాడు.

జె. రఘునాథరావు

కుక్కలను పెట్టినా కూడా మంద నష్ట పడుతూనే వచ్చింది. ఆ ప్రాంతాల తోడేళ్ళు జాస్తి. అవి ప్రతి రాత్రీ మందలోకి జొరబడి ఒకటో, రెండో గొర్రెలను లాక్కు పోతూం డేవి. మర్నాడుదయం గొర్రెలను ఎంచు కుంటే నష్టం బయట పడేది. తోడేళ్ళు రావటం కుక్కలు చూసేవి గాని, ఏమీ చేసేవి కావు; తోడేళ్ళు గొర్రెలను ఈడ్చుకు పోతూంటే చూస్తూ ఉండి పోయేవి. తోడేళ్ళు చంపి తినగా మిగిలిన గొర్రెలమాంసాన్ని కుక్కలు అవురావురని తినేసేవి.

ఇలా ప్రతి రోజూ జరుగుతున్నది. మంద నానాటికీ పలచనవుతున్నది. ఏం చెయ్యటానికీ పాలుబోక గొర్రెలకాపరి హతాశు డయాడు. "ఈ విధంగా సాగిపోతే సంకు రాత్రికి ఒక్క గొర్రె మిగలదు," అను కున్నాడు వాడు. వాడు అసహాయుడై, కంట కన్నీరు కార్చ సాగాడు.

అంతలో ఒక గడ్డం తాత అటుగా వెళుతూ గొర్రెలకాపరిని చూసి ఆగి, "ఎందు కురా, వెర్రి నాగన్నా, కంట తడి పెడు తున్నావు? ఏం కష్టం వచ్చి పడింది?" అని అడిగాడు.

"ఏడవ కేం జెయ్యను? దేవుడి మీద భారం వేసి సంత కెళ్ళిన రోజున పాతిక గొర్రెలు మాయమయాయి. మందను కని



పెట్టి ఉంటాయిగదా అని రెండు కాపలా కుక్కల్ని కొంటే, అవి ఉండీ, లేకా ఒకటిగానే ఉంది. ప్రతి రోజూ తోడేళ్ళు వచ్చి, ఒకటి రెండు గొర్రెల్ని కాజేసుకు పోతూనే ఉన్నాయి. ఇంత జరుగుతుంటే, దరిద్రపు కుక్కలు మొరగనన్నా మొరగవు!" అన్నాడు గొర్రెలకాపరి.

"కుక్కల కేం ఆహరం పెడుతున్నావు?" అన్నాడు గడ్డంతాత.

"రెండేసి పలాలు మాంసం పెడుతున్నాను. అంటే రెంటికీ చెరో ఎలుకా వేస్తున్నాను. ఆ వెధవకుక్కలకి అది చాలదాఏం?" అన్నాడు గొర్రెలకాపరి.

"ఇంకేం? అందుకే నీ గతి ఇందాకా వచ్చింది. అడపా దడపా ఓ గొర్రెను కోస్తూంటావు గద, దాని మాంసం కుక్కలకు తిన్నంత వేస్తూ ఉండు. నీ పని నువు సరిగా చేస్తే కుక్కలు కూడా తమ పని సరిగా చేస్తాయి," అన్నాడు తాత.

అది మొదలు గొర్రెలకాపరి తన కుక్కలకు కడుపు నిండా తిండి పెడుతూ వచ్చాడు. మొదటి రోజు ఒక్క గొర్రె కూడా పోలేదు. రెండో రోజు చీకటి పడేవేళ రెండు తోడేళ్ళు మంద కేసి వచ్చాయి.

"పదండి, పదండి! మా యజమాని మాకు కడుపు నిండా తిండి పెడుతున్నాడు. మీ ఎంగిలి మా కక్కర్లేదు," అని ఒక కుక్క మొరిగింది.

"వెళ్ళకండి, అన్నల్లారా! వచ్చి, మీ కడుపు నించుకుని, మా కూ్కడా ఇంత పెట్టండి," అని రెండో కుక్క మొరిగింది. తోడేళ్లు రెండో కుక్క మాటలే నమ్మాయి, ఎందుకంటే కుక్కలెన్నడూ తమకు ఎదురు చెప్పిన పాపాన పోలేదు. ఆ ధైర్యంతో అవి మందలో ప్రవేశించాయి.

మరుక్షణమే కాపలా కుక్కలు రెండూ భయంకరంగా అరుస్తూ వాటి పైన పడి, వాటిని చీల్చి చంపేశాయి.






# పాతాళనాగు

శోణా నదీ తీరాన ఉండే ఒక గౌడ నగరానికి మహీపాలుడు రాజుగా ఉండేవాడు. యువరాజుగా ఉండే కాలంలో అతను తన భార్యతో సహా నదీ తీరానికి వెళ్ళినప్పుడు నదిలో చేపలు పట్టుతున్న కొందరు బెస్తలు అతనికి ఒక బుట్టలో మూడు పెద్ద చేపలను పెట్టి బహుమానంగా ఇచ్చారు. వాటిని వాళ్ళు రాజభవనానికి చేర్చుతామన్నారు గాని, మహీపాలుడు తానే పట్టుకు పోతానని చెప్పి, చేపలబుట్టను తీసుకున్నాడు.

తరవాత అతను తన భార్యతో సహా కొండను చుట్టి నగరానికి వస్తూ, కొండ ఏటవాలులో ఒక పెద్ద బండరాతిపైన కూర్చొని, తనకు బెస్తలు బహూకరించిన చేపలను పరీక్షించసాగాడు. అవి నదిలో సాధారణంగా దొరికే చేపల కన్న పెద్దవి, మేలు జాతివి. మహీపాలుడి భార్య చేపలను ఆశ్చర్యంగా చూస్తూ, "ఆ పురుగేమిటి?" అన్నది కొంచెం భయపడుతూ.

బుట్టలో మూడు చేపలు గాక ఒక పురుగు కూడా ఉన్నది. అది నల్లగానూ, వికారంగానూ ఉండి, అయిదారంగుళాల నిడివి ఉన్నది. దాని కళ్ళు తీక్ష్ణంగా ఉన్నాయి. తోక మెలికలు తిరిగి పోతున్నది.

"ఛీ, అదేదో విషపు పురుగు. అవతల పారెయ్యండి," అన్నది మహీపాలుడి భార్య.

మహీపాలు డా పురుగును తోకపట్టి ఎత్తి, సమీపంలోనే ఉన్న పాడు బావిలో పడేశాడు. కొద్దిసేపటి తరవాత భార్యాభర్తలు ఇంటికి వెళ్ళిపోయారు.

ఇది జరిగిన కొంతకాలానికే మగధ రాజ్యానికీ, అంగరాజ్యానికీ మధ్య యుద్ధం జరిగింది. మహీపాలుడు తన తండ్రి వెంట మగధ తరఫున యుద్ధానికి వెళ్ళాడు. యుద్ధంలో మగధకు విజయం లభించింది

ఎల్. అనంతయ్య

గాని, మహీపాలుడి తండ్రి మరణించాడు. మహీపాలుడు తన నగరానికి తిరిగి వస్తూ తన రాజ్యంలో కళాకాంతులు లేక పోవటం గమనించాడు. నగరం వెలపల పొలాలు పాడై ఉన్నాయి. కొన్ని పల్లెలు పూర్తిగా కాలిపోయి ఉన్నాయి.

మహీపాలుడు ఇంటికి చేరుతూనే, "ఈ ప్రాంతాలకేదో పీడ పట్టినట్టున్న దేమిటి ?" అని అడిగాడు.

"అవును. పీడే పట్టింది. ఆ పీడను మీరే పెంచి పెద్ద చేశారు. ఆ రోజు మీరు పాడు బావిలో వేసిన పురుగు ఒక పాతాళ నాగు. మామూలు పాము పిల్ల అయితే మనం పోల్చుకోగలిగి ఉందుము. ఆ పాతాళ నాగు అంత చిన్న పిల్లగా బెస్తవాళ్ళ బుట్టల్లోకి ఎలా వచ్చిందో తెలీదు. అది బావిలో పెరిగి పెద్దదయింది. ఇప్పుడది ఇరవైబారల పాము. ఆకలివేస్తే దానినోటినుంచి మంటలు వస్తాయి. అది ఆహారం కోసం ఎంతమేర తిరిగితే అంతమేరా చెట్లూ, చేమలూ మాడి పోతాయి. చివరకు రాళ్ళలాటివి కూడా కమిరి పోతాయి. ఈ పాతాళనాగు మనుషులనూ, జంతువులనూ మింగటం లేదు. అంతవరకు మేలే. అది పాలు తాగుతుందని మన ప్రజలు కనిపెట్టి రోజూ




నాలుగు గంగాళాల పాలు తీసుకుపోయి కొండ కింద ఉంచుతున్నారు. అది ప్రతి ఉదయమూ వచ్చి ఆ పాలు తాగి, నదికి తిరిగి వెళ్ళి, నది మధ్యగా ఉండే రాతికి చుట్టుకుని పడుకుంటుంది. పాతాళలోకానికి తిరిగి పోయేమార్గం దానికి తెలీదు లాగుంది," అన్నది మహీపాలుడి భార్య.

"పాతాళనాగులు వేలకొద్దీ సంవత్సరాలు బతుకుతాయంటారు. ఈ నాగును చంపకపోతే ప్రమాదమే. ఈ పాముకే రోజూ నాలుగేసి గంగాళాల పాలు పోసి, మన ప్రజలు ఏం తాగుతారు? పిల్లలకేం పోస్తారు?" అన్నాడు మహీపాలుడు.



"జనం అల్లాడి పోతున్నారు. ఒక్కొరోజు నాగుకు కావలిసినన్ని పాలుండవు. ఆ రోజు ఆకలి తీరక అది తన యిష్టం వచ్చిన చోటి కల్లా పోతుంది. దారిలో ఏది ఉంటే అదంతా దాని నోటి మంటలకు ఆహుతి అయి పోతుంది. ఈ నాగుతో చాలా బాధగా ఉన్నది," అన్నది మహీపాలుడి భార్య.

"దీన్ని నేను ఎలాగైనా చంపి తీరు తాను," అంటూ అతను నది ఒడ్డుకు వెళ్ళి, నీటి మధ్యగా పొడుచుకు వచ్చే గండశిలను తొమ్మిదిసార్లు చుట్టి, నిగనిగలాడుతూ మెరుస్తున్న నల్లటి శరీరం గల నాగును చూశాడు. అక్కడినుంచి తిరిగి వస్తూ, ప్రతి రోజూ అది పాలు తాగే తొట్టిని కొండ కింద మలుపులో చూశాడు.

మర్నాడు ఉదయం మహీపాలుడు తన పెద్దఖడ్గాన్ని తీసుకుని పాతాళనాగు పాలు తాగే చోటికి వెళ్ళాడు. అది తొట్టిలోకి తల లోతుగా దూర్చి పాలు తాగేస్తున్నది. దాని మిగతా శరీరం బయటికి ఉన్నది. అదే మంచి అవకాశమనుకుని, మహీపాలుడు గబగబా దాన్ని సమీపించి, తన చేతగల ఖడ్గంతో దాని శరీరాన్ని రెండుగా తెగ నరి కాడు. ఆ దెబ్బతో తల గల భాగం కూడా బయట పడి పోయింది. నాగు ఇక చచ్చి పోతుందనుకున్నాడు మహీపాలుడు. దాని శరీరపు ఖండాలు రెండూ గిజగిజా తన్ను కోవటం అతను చూశాడు. అలా తన్ను కుంటూ అవి ఒకదాన్నొకటి చేరి, తెగిన చోట చిత్రంగా అతుక్కుని, ఏకమయాయి. నాగు ఎప్పటిలాగా అయి పోయి, అతనికేసి తిరిగి, భయంకరంగా అతనివైపు మంటలు చిమ్మ సాగింది. మహీపాలుడు కాలి సత్తువ కొద్దీ పరిగెత్తసాగాడు. కొంతదూరం వెళ్ళి వెనక్కు తిరిగి చూస్తే, నాగు నది కేసి వెళుతూ కనబడింది,

మహీపాలుడు ఇంటికి తిరిగి పోయి జరిగినదంతా తన భార్యకు చెప్పాడు.

"ఈ నాగును కత్తితో చంపటం అసంభవం. దాన్ని నూరు ముక్కలు చేస్తే నూరూ తిరిగి అంటుకుంటాయి. ఇంకెలా చంపేటట్టు?" అన్నాడు మహీపాలుడు.

గౌడనగరంలో గొప్ప జ్ఞాని అని పేరు పడిన ఒక వృద్ధుడున్నాడు. ఎటువంటి గడ్డు సమస్య వచ్చినా ఆ వృద్ధుడు ఉపాయాలు చెప్పేవాడు.

మహీపాలుడు తన భార్య సలహా పై ఆ వృద్ధుణ్ణి రాజభవనానికి పిలిపించి, తగిన గౌరవమర్యాదలు చేసి, పాతాళనాగు సమస్య వివరంగా చెప్పాడు.

వృద్ధుడు కాస్సేపు కళ్ళుమూసి ఆలోచించి, "రాజా, పాతాళనాగును జయించాలంటే దానితో నువు నీటిలోనే పోరాడాలి. మార్గాంతరం లేదు," అన్నాడు.

ఈ సలహా మహీపాలుడికి మరీ విడ్డూరంగా కనబడింది. నేల మీద చంపటానికి సాధ్యంకాకుండా ఉన్న నాగు నీటిలో తన చేత చస్తుందా? అదీగాక నది బాగా పూటుగా ప్రవహిస్తూ, మంచి ఉరవడి మీద ఉన్నది. ఆ నీటిలో నిలబడటమే కష్టం; నాగుతో యుద్ధం చెయ్యడమెలా?

ఇలాటి ప్రశ్నలకు వృద్ధుడు సమాధానాలివ్వలేదు. "నాకు తోచినది చెప్పాను.



ప్రజలను కాపాడటానికి ఏం చేస్తావో నీ యిష్టం!" అని వృద్ధుడు సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయాడు.

ఎంత అసాధ్యమైనా వృద్ధుడు చెప్పినట్టే చెయ్య నిశ్చయించి మహీపాలుడు, నాగు పాలుతాగటానికి వెళ్ళే సమయానికి అది రోజల్లా శిలను చుట్టుకుని పడుకునే చోటికి వెళ్ళాడు. ఆ శిల ఇంచుమించు నదీ మధ్యంలో ఉన్నది. రాజు నదిలోకి దిగి, బలంగా ఉన్న ప్రవాహానికి అడ్డంగా ఈదుతూ ఎలాగైతేనేం శిలను చేరుకుని, దాని మీదికెక్కి, ఖడ్గం చేతబట్టి సర్వసిద్ధంగా నిలబడ్డాడు.

కొంత సేపటికి నాగు పాలుతాగటం ముగించి తన స్వస్థానానికి తిరిగి వచ్చి, తన రాతి మీద ఎవరో నిలబడి ఉండటం చూసింది. అది నీటిలోకి పాకి ఈదుతూ శిలను సమీపించి, అతి వేగంగా శిల చుట్టూ తిరగసాగింది. మహీపాలుడు దాని కేసి దిగ్భ్రాంతుడై చూడసాగాడు. ఎందుకంటే, శిలచుట్టూ పాము శరీరం ఉన్నది. దాని తల ఎక్కడో, తోక ఎక్కడో తెలియ రావటం లేదు. ఇంతలో అతని కాలికేదో చుట్టుకుని, అతన్ని నీటిలోకి బలంగా గుంజ సాగింది. అది నాగు తోక. మహీపాలుడు తన వాడి ఖడ్గంతో నాగు తోక భాగాన్ని నరికేశాడు. అది అతని కాలి నుంచి ఊడి నీటిలోపడి ప్రవాహానికి కొట్టుకు పోయింది.

వృద్ధుడి సలహాలో ఉన్న కిటుకేమిటో ఇప్పుడు మహీపాలుడికి అర్థమయింది. అతనికి నాగు భయం పోయింది. అతను రాతి మీది నుంచి నీటి మట్టానికి దిగివచ్చి, నాగు శరీరాన్ని అందిన చోట నల్లా నరికి ఖండ ఖండాలు చేశాడు. ఒక్కొక్క ఖండమూ నీటి వెంబడి కొట్టుకు పోతూంటే అతనికి పరమానందం కలిగింది. ఈ ఖండాలు ఎప్పటికీ కలుసుకోలేవు. నాగు తల భాగం కూడా కొట్టుకు పోవటం కళ్లారా చూశాక మహీపాలుడు ఒడ్డుకు ఈది, ఇంటికి తిరిగి వెళ్ళి, తన నగరానికి నాగు బాధ వదిలించిన వృద్ధుడికి అంతులేని కానుకలు సమర్పించి సన్మానించాడు.

అయితే ఒక్క విషయం రాజు గ్రహించ లేదు. వృద్ధుడు పాతాళనాగుకు కూడా గొప్ప సహాయం చేశాడు. పాతాళనాగులకు చావులేదు. రాజు నరికిన నాగు ఖండాలు కాలక్రమాన సముద్రాన్ని చేరుకుని అక్కడ ఒకదాన్ని ఒకటి కలుసుకున్నాయి. అక్కడ కొందరు నాగులు ఈ కొత్త నాగును చూసి, తమ వాడేనని గుర్తించి, తమ లోకానికి తీసుకుపోయారు.





# కృష్ణావతారం

రానురాను కృష్ణుడు చేసే అగడాలు మితి మీరిపోయి గోపకులను భీభత్సంలో ముంచెత్తాయి. ఏం చెయ్యాలో తోచక వాళ్ళు దిమ్మరపోయి చూస్తూ ఊరుకున్నారు. గోపికలు మాత్రం అలా ఊరుకోలేదు. వారంతా కూడ బలుక్కొని, ఒక జట్టుగా యశోద వద్దకు వెళ్ళి ఆమె పైన విరుచుకు పడ్డారు.

"ఓయమ్మో, నువు కాగా ఒక గారాబు కొడుకును కన్నావు! వాడితో మేము పడే పాట్లు కూడా కాస్త చూడు మరీ! పోనీ చిన్నవాడు గదా అని చూస్తూ ఊరుకున్నందుకు ఇలాగా చేసేది? మీరు గొప్పవాళ్ళయితే అవుదురు గాక! అసలు తప్పంతా నీదే. నువే వాణ్ణిలా తయారుచేసి మా మీదికి పంపకం చేశావు. నీ గుండెలో జాలి అనేది ఏకోశానా ఉన్నట్టులేదు. నీ ముద్దులకొడుకు ఏం చేశాడో చెవులారా విను—" అని ఒకతె అంటుండగా మరొకతె ముందుకువచ్చి—

"ఏం చేశాడా? మా ఇంటో జొరబడి పది కడవల నెయ్యీ, పెరుగూ, పాలూ తాగేశాడు! 'కో' అంటూ కడవలన్నీ బోర్లా తోసేసి పారిపోయాడు. మా వంటి పేద వాళ్ళ కింత కన్న ఏం కావాలి? మే మెలా బతికేట్టు?" అన్నది.

అంతలో మరొక గోపిక ముందుకు వచ్చి, "ఓ తల్లీ, నీ కొడుకు రాక్షసుడు! నేను బానల్లోనూ, ఉట్ల మీదా వెన్న పెట్టి ఉంచితే, అంత వెన్నా తిని, బానలు పడ

## 4. కృష్ణుడి శైశవక్రీడలు



దోసి, ఉట్లు తెంచాడు. మేము వీడితో ఎలా వేగాలి ? ఎక్కడికి పోవాలి ?" అన్నది.

మరొకతె అమితమైన కోపంతో, చేతులు తిప్పుకుంటూ, నాట్యంచేస్తున్న దాని లాగా యశోదను సమీపించి, "వెనకింట్లో ఎన్నో నేతిబానలున్నాయి. తలుపుకు తాళంపెట్టి ఉంచాను. నీ మాయదారి కొడుకు వచ్చి పడి, తలుపును తాళంతో సహా విరగదన్ని, లోపల జొరబడ్డాడు. నేను హడలిపోయి పారిపోయాను. నెయ్యంతా తాగాడో, ఏం చేశాడో, ఏమో! వెళ్ళి చూద్దునుగదా, ఒక్క బొట్టు నెయ్యి లేదు. దేశం గొడ్డుపోయిందా, తల్లీ? ఈ పాట్లు పడేకన్న ఈ పల్లెకు అగ్గి పెట్టేసి, మా పశువులతో ఇంకో చోటికి పోయి నిక్షేపంగా బతుకుతాం!" అన్నది.

మరొకతె వెనక నుంచి అందర్నీ నెట్టుకుంటూ ముందుకు వచ్చి, "అదంతా ఏం వింటావు? మా యింట జరిగిన ఘోరం విను. నీ రాలుగాయి కొడుకు మా యింట జొరబడి పదికుండల నెయ్యీ, పాలూ, పెరుగూ ఇల్లంతా ఈ లోతున విదజిమ్మి, ఖాళీకుండలు చేతులా, కాళ్ళా తన్ని, వంట కుండల్లో ఉన్న అన్నమూ, కూరలూ పాయసమూ కుర్రకారు చేత తినిపించి, కుండలన్నీ పగలగొట్టి, దూడలను ఆవుల వద్దకు విడిచాడు. ఇంటో ఏడిచే బిడ్డకు ఒక్క చుక్క వెన్న గాని, పాలు గానీ, పెరుగు గాని లేదు," అన్నది.

మరొకతె ఏడుపు గొంతుతో, "నా మొగుడూ, పిల్లలూ తినాలని మోజుపడితే, పాలూ, పిండీ, కలకండా, వెన్నా కలిపి అట్లు వేసి, కుండల దొంతరలో పెట్టాను. నీ కొడుకు వచ్చి కుండలు దించి అన్నీ తినేశాడు. వాడి కడుపులో ఏం భూతాలున్నాయో ఏమో! నిజం చెబితే నా మొగుడు నమ్ముతాడా, తల్లీ?" అన్నది.

ఈ విధంగా ఒకరిని మించి ఒకరు యశోదకు కృష్ణుడి పైన చాడీలు చెప్పారు.



ఒకరింట బానలో కలిపి పెట్టి ఉంచిన పిండీ, పంచదారా తినేశాడు, అంతటితో పోక, కుండల్లో ఉన్న అన్నమంతా తినేశాడు; ఇవి చిన్నపిల్లలు చేసే పనులేనా? మరొకరి ఆవులనూ, దూడలనూ అడవిలోకి తరిమేశాడు; ఆ సమయానికి యింటి యజమానీ, కొడుకులూ ఇంట లేరు. అన్నీ అమానుషమైన పనులే! అందరూ అన్నీ చెప్పి, ఆఖరు మాటగా, "మే మెక్కడికన్నా వెళ్ళిపోతాం. నువ్వూ, నీ కొడుకూ ఉట్టి కట్టుకు ఊరేగండి!" అని తేల్చి చెప్పారు.

అందరి మాటలూ విని యశోద ప్రతి ఒక్కరినీ ఓదార్చి, "మీకు కలిగిన నష్టమంతా నేను అచ్చుకుంటాను, విచారించకండి. కాని మీరు లేకుండా మా కెలా గడుస్తుంది? బిడ్డ ఇలాంటి రాకసప్పనులు చేశాడో, లేదో. మీ రేమో చేశాడంటున్నారు. మీ రైనా అబద్ధా లెందుకు చెబుతారు? ఇక చూడండి, పిల్లవాణ్ణి ఎలా అదుపులో వుంచుతానో! మీ రేమాత్రమూ సందేహించక మీ ఇళ్ళకు వెళ్ళిపొండి," అని గోపికలను పంపేసింది.

తరవాత ఆమె కృష్ణుణ్ణి చేరదీసి, "ఎందుకురా, బాబూ, వాళ్ళ ఇళ్ళకూ, వీళ్ళ ఇళ్ళకూ పోతావు? నీకు వెన్నా,



పాలూ కరువయాయా? నే నిస్తాను, పాలు తాగు. గుక్కెడు తల్లిపాలకు పుట్టెడు ఇతర పాలు సమంకావంటారు. అయినవాళ్ళతో ఇలా పేచీలు తెస్తా వెందుకురా?" అంటూ తన కొడుక్కు పాలిచ్చి, చెక్కులు నొక్కి, తల వాసనచూసి, ముద్దులు పెట్టుకుని, చివరకు, "పొద్దున్నే లేచి నీ అల్లరి పనులు వినటంతోనే సరిపోయింది. ఇంత పనికి మాలినవాడివి, నిన్నే మనాలిరా? విడిచి పెట్టానంటే మళ్ళీ పోయి యాగీలు తెస్తావు. దుష్టుణ్ణి దయతలచరాదు," అంటూ కృష్ణుణ్ణి రెక్క పట్టుకుని బండి సమీపానికి తీసుకుపోయి, పెద్ద రోలుకూ, పిల్లవాడి





నడుముకూ పెయ్యీతాడు కట్టి, బెత్తం ఒకటి తీసుకుని, "కదిలావా, మొత్తుతాను. ఎలా కదులుతావో నేనూ చూస్తాను," అని తన ఇంటిపనులలో నిమగ్నురాలయింది.

కొంచెం సేపు గడిచింది. కృష్ణుడు తాడు పట్టి రోటిని తన దగ్గిరికి ఈడ్చుకున్నాడు. పశువుల ఆవరణ ద్వారం సమీపంలో రెండు మద్దిచెట్లు దగ్గిర దగ్గిరగా ఉన్నాయి. కృష్ణుడు రోటిని ఒడుపుగా ఆ మద్దిమాను లకు చేరబెట్టి, తాను వాటి మధ్యగా దూరి అవతలికి వెళ్ళి, బలం కొద్దీ లాగాడు. రెండుమానులూ పెళపెళా విరిగి పడి పోయాయి. అనేకమంది గోపకులూ, గోపి కలూ పరిగెత్తుకుంటూ వచ్చి, జరిగినది చూశారు. కొందరు గోపికలు యశోద వద్దకు పరిగెత్తి వెళ్ళి, "ఏం రాక్షసిబిడ్డమ్మా నీ కొడుకు! వాణ్ణి ఎక్కడైనా రోటికి కట్టు తారా? వాడు కాస్తా వెళ్ళి, ఇంతేసి చెట్లను విరిచి మీద పడేసుకుంటున్నాడు! చాలా తెలివిగా చేశాననుకుంటున్నావు కాబోలు, వెళ్ళి, బిడ్డకు ప్రమాదం రాకుండా చూసుకో!" అని చెప్పారు.

యశోద కీ మాట వినగానే గుండె ఝల్లు మన్నది. "అమ్మయ్యో!" అని కేకపెట్టి, పైట జారిపోయేదీ, జుట్టుముడి ఊడి పోయేదీ కూడా తెలియకుండా పరుగు తీసింది. గోపికలు ఆమె వెంట పరిగెత్తారు.

ఈలోపుగా నందుడూ, ఇతర గోపకులూ అక్కడికి వచ్చి, విరిగిపడి ఉన్న చెట్ల మధ్య కృష్ణుడు, మేఘాల మధ్య చంద్రుడి లాగా, నవ్వుముఖంతో కూర్చుని ఉండటం చూశారు. నందుడు చప్పున వచ్చి, పిల్లవాడి నడుముకు కట్టి ఉన్న పలుపుతాడు విప్పి, కుర్రవాణ్ణి ఎత్తుకుని, "వీడి నడుముకీ తాడేమిటి? తాటికి రోలేమిటి? దీన్ని ఈడ్చు కుంటూ వీడింత దూరం ఎలా వచ్చాడు? ఇంత పెద్ద మానులు ఎలా విరిగిపడ్డాయి? ఏమిటిదంతా?" అని అడిగాడు.





యశోద వచ్చి తానే కుర్రవాణ్ణి రోటికి తాడుతో కట్టానని చెప్పింది. నందుడు తన కొడుకు బలసత్వాలకు లోలోపల ఆశ్చర్యపోయి, పరమానందం చెందాడు.

ముసలి గోపకులకు ఇదేమీ అంతుచిక్కలేదు. "ఒక గాలి లేదు, పిడుగుపాటు లేదు, ఏ ఏనుగూ ఇటు కేసి రాలేదు, పోనీ సేనలన్నా రాలేదు; ఇలాటి సబబైన కారణాలేమీ లేకుండా, చంటివెధవ ఇంతేసి చెట్లను పడగూల్చాడు గదా, ఇంతంటె ఉత్పాతం ఏం కావాలి? ఇదేమన్నా మొదటిసారి కనకనా? రాక్షసిముండ పూతన అమాంతం చచ్చింది. అంత లావు బండి అకారణంగా ముక్కలుముక్కలయింది. ఇక్కడ ఉండటమే ప్రమాదంగా వుంది. కాని పుట్టి పెరిగిన ఈ చోటు విడిచి ఎక్కడికని పోతాం?" అని తమలో తాము అనుకుంటూ తమతమ ఇళ్ళకు వెళ్ళిపోయారు.

రోజులు గడిచాయి. బలరాముడికి ఎనిమిదేళ్ళూ, కృష్ణుడికి ఏడేళ్ళూ నిండాయి. వాళ్ళు తమ యీడు గోపబాలకులతో కూడి ఆడుతూ, దూడలతో ఆడుకుంటూ ఉత్సాహంగా కాలం గడుపుతున్నారు. చేతుల్లో చద్దిచిక్కాలూ, చెరణాకోలలూ తీసుకునేవాళ్ళు; కాళ్ళకు కిర్రచెప్పులు తొడిగేవాళ్ళు; పొట్టి జుట్టు ఎగరేసుకుంటూ బయలుదేరేవాళ్ళు; చుట్టుపక్కల ఉండే భూముల్లో గట్టిగా కేకలు పెడుతూ తోడేళ్ళను తరిమేవాళ్ళు; సరదాగా పాటలు పాడేవాళ్ళు; కూతలు పెట్టేవాళ్ళు; చెట్లెక్కేవాళ్ళు; తేనెపట్లు కనిపిస్తే తేనె తాగేవాళ్ళు; తెచ్చుకున్న అన్నాలు తినేవాళ్ళు. ఆ యాదవబాలకులకు జీవితం మధురమైన ఆటవిడుపు లాగా సాగింది.

ఇలా కాలం గడుస్తుండగా ఒకనాడు కృష్ణుడు బలరాముడితో ఇలా అన్నాడు:

"అన్నా, మనం ఈ వనం లోనే పుట్టాం, ఇనాళ్ళూ ఇక్కడే పెరిగాం. మందలూ,



గోపకులూ ఇంత కాలంపాటు ఒకేచోట ఉండటం మంచిదా? మేత నీళ్ళన్నిటినీ పశువులు మట్టగించేశాయి. చెట్లు నరుకుడు పడి ధ్వంసమయాయి. చెరువులూ, మడుగులూ రొంపిగుంట లయాయి. కూరలూ, కట్టెలూ కావాలంటే చాలా దూరం వెళ్ళవలిసి వస్తున్నది. కనక మనం ఈ ప్రదేశం వదిలిపెట్టి బృందావనానికి వెళ్ళిపోదాం. అది చాలా అందమైన వనమని చెబుతారు. అక్కడ గోవర్ధనగిరి ఉన్నదట. దాని పైన భాండీర మనే పేరుగల మహావటవృక్షం ఉన్నదట. బృందావనం మధ్యగా కాళిందీ నది ప్రవహిస్తూ వుంటుందట. అక్కడికి



వెళ్ళిపోయి సుఖంగా బతుకుదాం. ముసలి వాళ్ళు ఈ చోటు విడవటానికి ఇష్టపడకుండా ఉన్నారు. వాళ్ళను అదరగొట్టటానికి ఒక ఉపాయం చేస్తాను, చూడు."

ఇలా అంటూండగానే కృష్ణుడి శరీరం నుంచి వందల సంఖ్యలోనూ, వేల సంఖ్యలోనూ తోడేళ్ళు గుంపులు గుంపులుగా బయలుదేరి, చుట్టుపక్కల ప్రదేశమంతటా పరిగెత్తసాగాయి. గోపాలకులకూ, గోవులకూ గాభరా పుట్టిపోయింది. ఈ తోడేళ్ళ దౌష్ట్యం అసాధారణంగా కనబడింది. వాటిని వేటాడటం గోపకులకు ఎంతమాత్రమూ సాధ్యం కాలేదు. పులులను సైతం నిలవ వేయగల ఆబోతులను అవి చంపాయి. కాచే వాళ్ళు తల తిప్పి చూసే లోపుగా ఎటు నుంచో వచ్చి అవి దూడలను కాజేసుకు పోయాయి. ఈ ఉత్పాతానికి తోడు రాత్రి సమయాలలో పులుల రంకెలూ, సింహ గర్జనలూ, వినిపించ సాగాయి. పెద్దపెద్ద పందులు వచ్చి, ఎక్కడబడితే అక్కడ గుంటలు తవ్వుతున్నాయి.

గోపకుల పెద్దలంతా చేరి చర్చించారు. ఇదివరకు జరిగిన ఉత్పాతాలకే బెదిరి కూడా, వాళ్ళు ఉన్న చోటు విడిచిపెట్టలేక వాటిని సహించి ఊరుకుంటే, ఇప్పుడు



వాటన్నిటినీ మించిన ఉత్పాతం వచ్చి పడింది. ఏం చెయ్యాలి?

"బృందావనం చాలా దివ్యంగా ఉంటుందని అందరూ తెగచెబుతున్నారు. కాని అక్కడ కూడా దుర్గమ ప్రాంతాలున్నాయట; వాటిలో రాక్షసు లుంటారట. ఏమైనా, ఏదో ఒకటి చెయ్యాలి. ఎక్కడికైనా వెంటనే పోవలిసిందే గాని ఇక్కడ ఒక్క క్షణం ఉండటం సాధ్య పడదు. క్షణక్షణానికీ ఏదో నష్టం జరుగుతూనే ఉన్నది," అని గోప వృద్ధులు తేల్చారు.

వారందరూ ఈ విధంగా అనుకుంటూండగా అక్కడికి నారదుడు వచ్చి, నంద గోపుణ్ణి పిలిచి, దూరంగా తీసుకుపోయి, "మీరందరూ కలిసి బృందావనం వెళ్ళాలనుకుంటున్నారు. కాని అక్కడ రాక్షసు లున్నారనీ, నీ కొడుకుకు ప్రమాదం చేస్తారేమోననీ నువు భయపడుతున్నావు. అవునా? విను. నీ కొడుకును మనుష్య మాత్రుడుగా భావించకు. అతను రాక్షసులను చంపటానికే అవతారమెత్తిన ఆది నారాయణుడు. కృష్ణుడూ, బలరాముడూ కూడా నారాయణాంశన పుట్టిన వాళ్ళే. కృష్ణుణ్ణి చంపటానికి రాక్షసులు పూతన రూపంలో వచ్చీ, బండిలో దాగీ, మద్దిచెట్ల రూపం ధరించీ, అతన్ని చంపలేకపోగా, తామే అతని చేతిలో చచ్చారు. నువు ప్రత్యక్షంగా చూశావుకద? అందుచేత, ఏ మాత్రమూ సంకోచం లేకుండా మీ అందరి నివాసమూ బృందావనానికి మార్చు. తప్పక మేలు కలుగుతుంది," అని చెప్పాడు.

నారదుడు కృష్ణుణ్ణి కూడా చూసి, అదే మాట చెప్పి వెళ్ళిన తరవాత, నందగోపుడు మిగిలిన గోపకులతో, "మనమంతా బృందావనానికి తరలిపోతున్నాం. అదే నిశ్చయం. అందరూ అందుకుగాను ప్రయాణసన్నాహం ప్రారంభించండి," అన్నాడు.





# అరణ్యపురాణం

## 7

బలదేవుడు అరణ్యమృగాలను గురించి అద్భుతమైన విషయాలు చెప్పేవాడు. దూరంగా కూర్చుని ఆ విషయాలు వినే పిల్లలకు కళ్ళు వెళ్ళుకొచ్చేవి: ఆ గ్రామం అరణ్యాన్ని అనుకునే ఉండటంచేతా, లేళ్ళూ, అడవిపందులూ పొలాలలోపడి ధ్వంసం చేసేవి గనకా, సందెచీకట్లో ఎప్పుడైనా పులి వచ్చి ఎవడో మనిషిని ఈడ్చుకుపోవటం జరుగుతూ ఉండటంచేతా, అరణ్యమృగాలను గురించే చెట్టు కింద విశేషంగా కబుర్లు సాగుతూండేవి.

బలదేవుడు తన తుపాకీని తొడల మీద అడ్డంగా పెట్టుకుని ఒకదాన్నిమించి మరొకటిగా అద్భుతమైన కథలు చెప్పేస్తుంటే మౌగ్లీకి పొట్ట చెక్కలైపోయేది ; తాను నవ్వుతున్నట్టు తెలియరాకుండా అతను ముఖానికి చేతులు అడ్డం పెట్టుకునేవాడు.

బలదేవుడు చెప్పేశాడు : మెన్నువా కొడుకు నెత్తుకుపోయినది దయ్యపు పులిట. కొన్ని సంవత్సరాల క్రితం చచ్చిపోయిన వడ్డీ వ్యాపారస్థుడొకడు, దుర్మార్గుడు, దయ్యమై పులిని ఆవేశించాడట.

"ఇందులో అబద్ధమేమీ లేదు. ఆ పురన్ దానుగాడి ఖాతాపుస్తకాలు తగలబెట్టినప్పుడు దొమ్మీ జరిగింది చూశారూ ? ఆ దొమ్మీలో దెబ్బతగిలి వాడి కాలొకటి కుంటి అయిపోయింది. నేను చెప్పిన పులి ఉంది చూశారూ ? అదీ కుంటిదే. ఎందుకంటే దాని కాలి గుర్తులన్నీ ఒకటిగా లేవు," అన్నాడు బలదేవుడు.

"ఇకనేంమరీ ?" అంటూ ముసలాళ్ళంతా తల లాడించారు.

"మీరు చెప్పుకునే కబుర్లన్నీ ఇంత ఆకాశపోకాశవేనా ? ఆ పులి పుట్టటమే



కుంటిదిగా పుట్టింది. ఈ మాట అందరికీ తెలుసు. నక్కపాటి ధైర్యం కూడా లేని జంతువులో పక్షీవ్యాపారి దయ్యం ఉన్న దనటం వట్టిపిచ్చిమాట," అన్నాడు మౌగ్లీ.

ఆశ్చర్యంతో బలదేవుడి నోట మాట రాలేదు. గ్రామపెద్ద పరకాయించి చూసి, "ఎవరదీ? ఓహో, అడివికుంకా? అంత తెలిసినవాడివైతే దాని చర్మం పట్టుకురా. పట్టుకొచ్చిన వాళ్ళకు నూరురూపాయలు బహుమతీ ఇస్తామని సర్కారువారు ప్రకటించారు. ఏమైనా నువ్వు పెద్దవాళ్ళ సంభాషణలో కలగజేసుకోకుండా ఉంటే మేలు," అని సలహాయిచ్చాడు.



మౌగ్లీ లేచి నిలబడి, "ఇందాకట్నుంచీ వింటున్నాను. బలదేవుడు ఒకటి రెండు సార్లు తప్ప, పక్కనే ఉన్న అరణ్యం గురించి ఒక్కముక్క నిజం చెప్పలేదు. ఆయన చూశాననే దయ్యాల కబుర్లూ, దేవుళ్ళ కబుర్లూ, పిశాచాల కబుర్లూ ఎలా నమ్మటం?" అంటూ వెళ్ళిపోయాడు.

బలదేవుడు చిర్రుబుర్రులాడాడు.

"ఆ అబ్బాయిని గొడ్ల వెంట త్వరగా పంపటం మంచిది," అన్నాడు గ్రామపెద్ద.

గ్రామానికి చెందిన కుర్రాళ్ళు తెల్లవారుతూనే పశువులను తోలుకుని ఊరి బయటికి వెళ్ళి, రోజల్లా వాటిని మేయనిచ్చి, చీకటి వేళకు ఇళ్ళకు తిరిగి వస్తారు. పిల్లలు పశువుల మంద వెంట ఉన్నంతకాలమూ వారికి అపాయం లేదు. ఎందుకంటే, పులి కూడా మందగా ఉన్న పశువుల చాయలకురాదు. కాని పిల్లలు ఏ పూలగుత్తులు కొయ్యటానికో, తొండలను తరుముతూనో మందకు దూరం వెళ్ళితే వారికి అడవి జంతువుల వల్ల భయం ఏర్పడుతుంది.

తెల్లవారగానే మౌగ్లీ "రాముడు" అనే దున్నపోతు మీద ఎక్కి బయలుదేరేవాడు. గేదెలు ఒక్కటొక్కటే లేచి అతని వెనకగా బయలుదేరేవి.





పశువులు మేసే ప్రదేశం నిండా తుప్పలూ, రాళ్ళూ ఉండేవి. అది ఎగుడు దిగుడుగా ఉండేది. పశువులు పల్లాలలోకి ప్రవేశించి కంటికి కనిపించకుండా పోయేవి.

మౌగ్లీ తన మందను అరణ్యం సమీపానికి, వాయిన్‌గంగ ఒడ్డుదాకా తోలుకుపోయి, "రాముడి"మీది నుంచి దిగి, అక్కడి వెదుళ్ళలో ప్రవేశించాడు. అక్కడ అతని కోసం "అన్న" వేచి ఉన్నాడు.

"నీ కోసం ఎన్నో రోజులుగా కాచుకుని ఉన్నాను. ఈ పశువుల కాపరి పనేమిటి నీకు?". అని అన్న మౌగ్లీని అడిగాడు.

"అలా ఏర్పాటయింది. కొంతకాలం నేను పశువులు కాయాలి. షేర్‌ఖాన్ ఏం చేస్తున్నాడు?" అని మౌగ్లీ అడిగాడు.

"వాడు మళ్ళీ ఈ ప్రాంతాలకు తిరిగి వచ్చి, నీ కోసం మహా చూశాడు. కాని ఇక్కడ వేట సాగక మళ్ళీ ఎటో వెళ్ళాడు. వాడు నిన్ను చంపాలనే ఉన్నాడు," అన్నాడు అన్న.

"సరే, షేర్‌ఖాన్ తిరిగి వచ్చేదాకా నువు గాని, మరో అన్నగాని ఆ కనిపించే మిట్ట మీద కూర్చుని, పొద్దున నేను పశువులను తోలుకుని వచ్చేటప్పుడు నాకు కనబడుతూ ఉండండి. వాడు తిరిగి రాగానే, మైదానం మధ్యనుండే కందకంలో నన్ను నువు కలుసుకో. వాడి ఆచూకీ నాకు తెలుస్తూ ఉండటం అవసరం," అన్నాడు మౌగ్లీ.

అన్నను పంపేసి అతను చెట్టునీడ చూసుకుని, పడుకుని నిద్ర పోయాడు. చుట్టూ పశువులు మేస్తున్నాయి.

గొడ్ల కాయుట మంత తీరిక పని మరొకటి ఉండదు. గొడ్ల కాసే పిల్లలకు రోజల్లా ఏమీ పనిలేదు. పశువులు మేత మేస్తూ, కదులుతూ, మళ్ళీ మేస్తూ రోజల్లా గడిపేస్తాయి. అవి అరవనన్నా అరవవు. గేదెలు మేసినంతసేపు మేసి, ఏ నీటి గుంటో, బురద గుంటో చూసుకుని, అందులో పడుకుని



ముట్టెలు మాత్రమే బయటికి పెడతాయి. గొర్ల కాసే పిల్లలకు ఎప్పుడైనా ఒక్కసారి గద్ద కేక ఆకాశంలో నుంచి అస్పష్టంగా విని పిస్తుంది. ఏ గొడ్డయినా చచ్చి దాని కళ్ళ పడిందో, ఆ గద్ద రివ్వున నేల కేసి వస్తుంది. దాన్ని గమనించి అనేక ఇతర గద్దలు అనేక మైళ్ళ దూరంనుంచి వచ్చి, చచ్చిన గొడ్డు మీద వాలి, అన్నీ కలిసి గొడ్డు కళేబరాన్ని పీక్కు తింటాయి.

పిల్లలు కొంతసేపు నిద్రపోతారు. కొంత సేపు తుంగతో బుట్టలు అల్లుతారు. లేకపోతే అడివి కాయలు ఏరుకొచ్చి మాలలు కడ తారు. తొండలూ, పాములూ తిరుగుతుంటే వాటిని గమనిస్తారు. లేకపోతే మట్టితో ఇల్లు కడతారు, రాజులనూ, రాణులనూ, దేవత లనూ తయారు చేసినట్టు నటిస్తారు. పొద్దు వాలగానే పిల్లలు గొర్లను కేక పెడతారు. అవి తామున్న చోటు నుంచి లేచి, కదిలి, పిల్లల వెంట గ్రామానికి తిరిగి పోతాయి.

మౌగ్లీ పశువులను తోలుకుని వచ్చే టప్పుడు ప్రతి ఉదయమూ మిట్టకేసి చూసే వాడు. అతని అన్నలలో ఎవడో ఒకడు దాని మీద కనిపించేవాడు; అంటే షేర్‌ఖాన్ ఇంకా తిరిగి రాలేదన్నమాట. అతను రోజూ నీడ పట్టున పడుకుని నిద్రపోయి, తన అరణ్య జీవితం గురించి కలలు కనేవాడు. షేర్‌ఖాన్ నిజంగానే వచ్చి ఉంటే, వాడు అరణ్యంలో ఏమూల తన కుంటి కాలుతో తప్పటడుగు వేసినా మౌగ్లీకి తెలిసి ఉండేదే ననుకోవచ్చు.

చిట్టచివరకు ఒక ఉదయం మౌగ్లీకి మిట్ట మీద తన అన్నలలో ఒకడూ కనిపించ లేదు. మౌగ్లీ తనలో తాను నవ్వుకుని ఆనాడు పశువులను కందకం పక్కన ఉన్న ఎర్ర తంగేడు చెట్టు కేసి తోలుకు పోయాడు. అక్కడ పెద్దన్న వేచి ఉన్నాడు. అతని ఒంటి పైన రోమాలన్నీ నిక్కబొడుచుకుని ఉన్నాయి. "షేర్‌ఖాన్ వచ్చాడు," అన్నాడు అన్న రొప్పుతూ. —(ఇంకా వుంది)



ప్రపంచపు వింతలు :

# 61. సమర్రా మినార్

షియా ముసల్మానులకు సమర్రా పవిత్ర యాత్రాస్థలం. టైగ్రిస్‌నది పైన గల ఈ స్థలంలో అబ్బాస్ సంతతి ఖలీఫాలు 9 వ శతాబ్దిలో రాజధాని ఏర్పాటు చేసుకున్నారు. తొమ్మిదవ ఖలీఫా నిర్మించిన ఈ మినార్ ఎత్తు 170 అడుగులు, బాబిలన్ టవర్ల పంపిణీలో ఇది ఇటుకలతో నిర్మించబడింది.



Photo by Madan Gopal



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఒకని పాటు

పంపినవారు:
హరి రాజేశ్వరి, యల్లందు

Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

పదిమంది సాపాటు

పంపినవారు:
హరి రాజేశ్వరి, యల్లండు

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1967 ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటించబడును.





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ డిశెంబర్ నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## డిశెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఒకని పాటు

రెండవ ఫోటో : పదిమంది సాపాటు

పంపినవారు : హరి రాజేశ్వరి,

యల్లందు (ఖమ్మం జిల్లా)

బహుమతి మొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: "CHAKRAPANI"

# కుటుంబము అంతటికి ఫోస్ఫోమిన్® వల్ల ఆరోగ్యము కలుగును

ఫోస్ఫోమిన్ పండు రుచిగల ఆకుపచ్చ విటమిన్ టానిక్. దీనిలో విటమిన్ బి కాంప్లెక్స్ మరియు అనేక గ్లయిసరో ఫాస్ఫేట్లు గలవు. వాటివలన మీ కుటుంబము దారుఢ్యముగా, సరదాగా, ఆరోగ్యముగా నుండును. ఇంట్లో ఫోస్ఫోమిన్ ఉంచండి. దానితో అలసట, ఆయాసము ఇక ఎంత మాత్రమూ వుండవు. ఫోస్ఫోమిన్ శక్తి నిచ్చును, ఆకలిని అధికము చేయును. సహన శక్తిని పెంపొందించును. మరియు శరీరము యొక్క రోగ నిరోధక శక్తిని ఎక్కువ చేయును. కుటుంబములో అంతా ఆరోగ్యముగా వుండడానికి రహస్యం ఫోస్ఫోమిన్.

SQUIBB
Phosfomin

SQUIBB® ™®

® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్. ఇన్కార్పొరేటెడ్ వారి
రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కు. వినియోగం: దీని శ్రీ సెన్స్ర్
అవయోగదారులు కెరండండ్ ప్రేండండ్ ప్రయుక్తిక రిమార్క్.

SARABHAI CHEMICALS

Shilpi SC281ATel.

# దిలీప్ బృందం

## వైకుంఠపాళీ ఆట









ఫ్యూజ్

అరే! దీపాలారి పోయాయే!

ఆట మంచి తమాషాగా వున్నప్పుడే ఆరిపోయాయే!

ఉండండి. నా 'ఎవరెడి' తీసుకొస్తా. ఆట ఆడుకోవచ్చు.









వారికి అభిప్రాయ బేధాలు
లేకపోలేదు.... కాని






న్యూట్రిన్
స్వీట్స్ & టాఫీలు
అంటే వారు ఏకాభిప్రాయులే!



న్యూట్రిన్ కన్‌ఫెక్షనరీ కం.
(ప్రైవేట్) లిమిటెడ్
చిత్తూరు, ఆంధ్రప్రదేశ్





EP NC-11

నాన్నా, నీ సొమ్ము బ్యాంకులో పెరుగుతుందని చెప్పావు!
ఎలా పెరుగుతుంది నాన్నా?

నాలాగే యింకా చాలామంది బ్యాంకులో సొమ్ము దాచుతారు. కాబట్టి అందులో చాలా సొమ్ము వుంటుంది. ఈ బ్యాంకు దాని దగ్గర వున్న సొమ్ములో కొంత భాగాన్ని, ఫ్యాక్టరీలకి, దుకాణాలకి, ప్రభుత్వానికి అప్పుగా యిస్తుంది. కొంత స్వల్పకాలం తర్వాత, తన సొమ్మును వుపయోగించినందుకు కొంత వడ్డీతో పాటు తన ఋణాన్ని పొందుతుంది. ఈ బ్యాంకు నా సొమ్ముని కొంత వుపయోగించుకుంది కాబట్టి, ఈ వడ్డీలో కొంత భాగాన్ని నాకిస్తుంది. ఇలాగ సొమ్ము పెరుగుతుంది. నేను కనుక బ్యాంలో పెట్టకపోతే, అది పెరగదు.
అది పెరగగలదా?

లేదు. నువ్వు సొమ్మును పంజాబ్ నేషనల్ బ్యాంకులో దాచుతావు కదూ?

అవును. అది నా బ్యాంకు. ఇది చాలా పురాతనమైనది. పెద్ద పెద్ద బ్యాంకులలో ఒకటి మరియు దీనికి 475 కంటె ఎక్కువ బ్రాంచీలున్నాయి.

# పంజాబ్ నేషనల్ బేంక్

PR-PNB-5623 TE





త్వరలో వస్తోంది!

శ్రీ నిలయం పిక్చర్స్ వారి

# శ్రీమతి

దర్శకత్వం.... విజయారెడ్డి

సంగీతం..... శ్రీనిత్యానంద్

వాణీ రిలీజ్

# AWARDS!

## WON PLENTY

**YET WE DON'T SAY
WE ARE THE BEST**

**ONLY**

**WE DO OUR BEST**



**PRASAD PROCESS PRIVATE LTD**

**CHANDAMAMA BUILDINGS MADRAS-26**

